

# చందమామ

అక్టోబర్ 1994



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 4.00

సంవత్సర చందా : 48.00



Estd. 1947

CHANDAMAMA PUBLICATIONS

## పాఠకులకు, శ్రేయోభిలాషులకు విజ్ఞప్తి

ప్రియమైన పాఠకులకు, శ్రేయోభిలాషులకు,

నమస్కారం. చందమామ పత్రిక వెల పెంచకుండా, అందరికీ అందుబాటులో వుండేలా చేయడానికి మేము ఎల్లప్పుడూ ప్రయత్నిస్తున్నాము. ఇక తప్పదనుకున్నప్పుడు మాత్రమే మా సమస్యను పాఠకులకూ, శ్రేయోభిలాషులకూ తెలియజేస్తూ వచ్చాము.

ఇటీవల కొన్ని సంవత్సరాలుగా పత్రికా ప్రచురణకు సంబంధించిన వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. వాటన్నిటినీ భరించాము. కాని హఠాత్తుగా పెరిగిన న్యూస్ ప్రింట్ కాగితం ధర కారణంగా పత్రిక వెల పెంచడం ఇప్పుడు తప్పనిసరి అయింది. నవంబర్ '94 నుంచి చందమామ విడిప్రతి వెల రూ. 5-00; సంవత్సర చందా 60-00 రూపాయలు.

పాఠకులూ, శ్రేయోభిలాషులూ పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకుని మాతో ఎప్పటిలాగే సహకరించగలరని ఆశిస్తున్నాము. కాగితం ధర తగ్గినట్టయితే మరిన్ని వైవిధ్యమైన అంశాలతో చందమామను మరింత ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా తీర్చిదిద్దగలమని ఈ సందర్భంగా పాఠకులకు మనవి చేస్తున్నాము.

కృతజ్ఞతలతో,

బి. విశ్వనాథరెడ్డి
ప్రచురణకర్త




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## ఆదర్శవంతమైన సంస్కరణలు!



మన విద్యావిధానంలోనూ, బోధనా పద్ధతులలోనూ, మంచి మార్పులు రానున్నాయని తరచూ పత్రికలలో వార్తలు వస్తున్నాయి. ప్రభుత్వం ఆదేశించడంతో చిన్న తరగతులలో చేర్చుకోవడానికి పసిపిల్లలకు కూడా 'ఇంటర్వ్యూ' జరిపే పద్ధతిని పాఠశాలలు వదులుకుంటున్నాయి.

ఒకటవ తరగతికి కిందిదశలో పాఠ్య పుస్తకాలను, నోటు పుస్తకాలను నిషేధిస్తున్నారు. పైతరగతులలో కూడా పాఠ్య గ్రంథాలనూ, 'హోమ్‌వర్క్'నూ తగ్గించి పిల్లలలో లోకజ్ఞానం పెంచే ఇతర పుస్తకాలను చదివే అలవాటును కలుగజేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆదర్శవంతమైన ఈ సంస్కరణలన్నీ వినడానికి ఇంపుగానే ఉన్నాయి. కాని ఇవి ఎంత వరకు ఆచరణ యోగ్యమో, ఎప్పుడు ఆచరణలో పెట్టగలరో తెలియడం లేదు.



ఇటీవల ఉత్తర భారతదేశంలో ఒక విద్యా సంస్థ ఈ సూచనలన్నిటినీ అమలుపరచి, మంచి ఫలితాలు సాధించిందని తెలియవచ్చింది. దేశమంతటా వీటిని అమలు చేయడం సాధ్యమా? అలా అమలు చేసే శుభఘడియలు ఎప్పుడు వస్తాయా అని విద్యార్థులూ, తల్లిదండ్రులూ ఎదురు చూడడంలో ఆశ్చర్యం లేదు!

సంపుటి : 96 అక్టోబర్ '94 సంచిక: 4

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



వార్తలు - విశేషాలు :

# శ్రీలంకలో మార్పులు



శ్రీలంక మాజీ ప్రధాని శ్రీమతి బండార నాయకే కుమార్తె శ్రీమతి చంద్రికా కుమార తుంగా ప్రస్తుతం శ్రీలంక ప్రధాన మంత్రి అయ్యారు. ఆ పదవిని చేపట్టిన రెండవ మహిళ ఆమె!

1959వ సం॥లో నాటి ప్రధాని ఎస్.డబ్ల్యు. ఆర్.డి. బండారనాయకే హత్య కావడంతో ఆయన సతీమణి శ్రీమతి సిరిమావో బండార నాయకే 1960వ సం॥లో ప్రధాని అయి, ప్రపంచంలోనే మొట్టమొదటి మహిళా ప్రధానిగా పేరుగాంచారు. ఆమె 1960 నుంచి '65 వరకూ, ఆ తరవాత 1970 నుంచి '77 వరకూ ఆ పదవిలో ఉన్నారు. 1978వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఆమె నాయకత్వంలోని శ్రీలంక ఫ్రీడమ్ పార్టీ, జె.ఆర్. జయవర్ధనే నాయకత్వం వహించిన యునైటెడ్ నేషనల్ పార్టీ చేతిలో ఓడిపోయింది.

యునైటెడ్ నేషనల్ పార్టీ 17 సం॥లు అవిచ్ఛిన్నంగా అధికారంలో కొనసాగి గత ఆగస్టులో జరిగిన ఎన్నికలలో ఓడిపోయింది. ప్రతిపక్షమైన పీపుల్స్ అలయెన్స్ అంటే శ్రీలంక ఫ్రీడమ్ పార్టీ ఇతర మిత్రపక్షాలు కలిసిన కూటమి స్వల్పంగా ఆధిక్యతను సాధించింది. యు.ఎన్.పి. మెజారిటీకి పది స్థానాలు తక్కువయ్యాయి. ఇతర మిత్ర పక్షాల మద్దతుతో, పీపుల్స్ అలయెన్స్ శ్రీమతి చంద్రికా కుమారతుంగాను ప్రధానిగా ఎన్నుకున్నది. ఆగస్టు 19వ తేదీ 21 మంది మంత్రులతో శ్రీమతి చంద్రికా కుమారతుంగా ప్రధానమంత్రి పదవీ బాధ్యతలు చేపట్టారు. ఆమె మంత్రిమండలిలో ఒకరుగా ఆమె తల్లి శ్రీమతి సిరిమావో చోటు చేసుకోవడం విశేషం!

భారత ద్వీపకల్పానికి దక్షిణంగా హిందూ మహా సముద్రంలో 'నీటిబొట్టు'లా కనిపించే ద్వీపదేశం శ్రీలంక. రామాయణంలో చెప్పబడిన లంక ఇదే. అశోక చక్రవర్తి బౌద్ధమత ప్రచారం కోసం తన కుమార్తెను సింహళానికి పంపిన విషయం అందరికీ తెలిసినదే. అనూ

రాధపురంలోని బౌద్ధ ఆలయంలో బుద్ధుడి దంతం 2000 సంవత్సరాలుగా రక్షింపబడుతున్నది.

ఇక ఇటీవలి చరిత్రను పరిశీలించినట్టయితే, 16వ శతాబ్దంలో పోర్చుగీసులు లంకను ఆక్రమించారు. 17వ శతాబ్దంలో అది డచ్ వారి అధీనంలోకి వచ్చింది. 18వ శతాబ్దారంభంలో బ్రిటిష్ దాని అధికారాన్ని చేజిక్కించుకున్నది. 1948వ సం॥లో అది బ్రిటిష్ కామన్వెల్త్‌లో స్వతంత్ర దేశమయింది. 1977వ సం॥లో అది సోషలిస్టు రిపబ్లిక్‌గా ప్రకటించుకున్నది సిలోన్ (సింహళం) అనే పేరును వదిలి పురాతనమైన 'శ్రీలంక' అనే పేరును పెట్టుకున్నది. 1977వ సం॥లో జరిగిన ఎన్నికల అనంతరం రూపొందిన నూతన రాజ్యాంగం ప్రకారం జయవర్ధనే ఆ దేశానికి అధ్యక్షుడయ్యాడు.

1989వ సం॥లో యు.ఎన్.పి. అధికారాన్ని దక్కించుకున్నప్పటికీ మెజారిటీ తగ్గింది. అంత వరకు ప్రధానిగా ఉన్న ప్రేమదాస అధ్యక్షుడయ్యాడు. 1993వ సం॥ మేడే ఉత్సవంలో పాల్గొంటున్నప్పుడు ఆయన హత్యచేయబడడంతో నాటి ప్రధాని డి.బి. విజెతుంగే అధ్యక్షుడయ్యాడు. ఆయన పదవీ కాలం 1995 జనవరితో ముగుస్తుంది. అధ్యక్షుడి ఎన్నికలు నవంబర్‌లో జరుగనున్నవి.

శ్రీలంకలో అధిక సంఖ్యాకులయిన సింహళులు బౌద్ధులు. ఉత్తర, తూర్పు ప్రాంతాలలో తమిళులు నివసిస్తున్నారు. తమిళులు దేశ జనాభాలో ఐదో వంతు ఉన్నారు. రెండు జాతుల మధ్య 1956వ సం॥లో హింసాత్మక ఘర్షణలు ప్రారంభమై, 1983వ సం॥లో అంతర్యుద్ధంగా తీవ్ర రూపం దాల్చింది. ఇరవై వేల మందికి పైగా ప్రాణాలు కోల్పోయారు.




ఫ్రాన్స్‌లో చదువుకున్న చంద్రికా బండారనాయకే, రాజకీయాల పట్ల ఆసక్తి కనబరచిన ప్రముఖ సినీనటుడు విజయకుమారతుంగాను వివాహమాడింది. శ్రీలంక తమిళ నాయకులతో సంబంధాలు పెంచుకుని, సమస్యను పరిష్కరించి ఉభయ జాతీయుల మధ్య సామరస్యం ఏర్పరచడానికి ఆయన ప్రయత్నించాడు. కాని, ఆయన 1989వ సం॥లో హత్యచేయబడ్డాడు. 1990వ సం॥లో శ్రీమతి చంద్రికా కుమారతుంగా శ్రీలంక ఫ్రీడమ్ పార్టీలో చేరారు. 1993వ సం॥ లో జరిగిన ప్రాంతీయ ఎన్నికల అనంతరం పశ్చిమ ప్రాంతానికి ముఖ్యమంత్రిగా ఆమె తన రాజకీయ జీవితం ప్రారంభించారు.




# చెత్తా చెదారం

సీత ఎంతో అందంగా వుంటుంది. మనసు కూడా ఎంతో మంచిది. అందుకే సవతి తల్లి రమణమ్మ ఎన్ని బాధలు పెట్టినా కిమ్మన కుండా సహిస్తున్నది.

రమణమ్మ కూతురు గీతకు, సీతను చూస్తేఅసూయ. అది పొద్దస్తమానమూ తల్లికి, సవతిఅక్క మీద లేనిపోని చాడీలు చెప్పి కొట్టిస్తూండేది.

సీతకు కురూపివాణ్ణీ, పేదవాణ్ణీ ఇచ్చి పెళ్ళి చేయాలని రమణమ్మ అనుకుంటున్నది. ఎవరో చెప్పగా అలాంటి సంబంధం వున్నదని విని ఆహ్వానం పంపింది. అది చేరవలసిన వాళ్ళకు కాక మరొకరికి చేరడంతో, ఇంటికి వచ్చినవరుణ్ణి చూస్తేచాలాఅందంగా వున్నాడు. పైగా అతడు చాలా భాగ్యవంతుడని కూడా తెలిసింది. వెంటనే రమణమ్మ పెళ్ళిచూపులకు సీతకు బదులు గీతను చూపించింది. వరుడికి ఆ అమ్మాయి నచ్చినట్లే కనబడింది.

ఇంతలో మంచినీళ్ళు తీసుకుని అక్కడకు వచ్చిన సీతను, వరుడు చూడనే చూశాడు. అంతే! ఆ పిల్లనేపెళ్ళిచేసుకుంటానని ఖచ్చితంగా చెప్పేశాడు.

రమణమ్మ, సీత గురించి అతడికి తను కల్పించిన ఎన్నో చెడ్డ విషయాలు చెప్పింది. పెళ్ళికొడుకు ఆమె మాటలు పట్టించుకోకుండా, సీతనే పెళ్ళిచేసుకుంటానన్నాడు, ఆలోచించి ఏ విషయమూ కబురుపెడతానని చెప్పి, పెళ్ళివారిని పంపించేసింది రమణమ్మ.

ఈ జరిగినదానికి రమణమ్మకు వచ్చిన ఉక్రోషం అంతా ఇంతా కాదు. ఆమె గీతతో, "ఇది మనింట్లో వుండగా నీకు పెళ్ళి కాదు. ఈ రాత్రి దీని మొహం మీద వేడి వేడి నూనె పోసేస్తాను. దాంతో దీని అందం నాశనమవుతుంది," అన్నది. గీత ఈ మాటలకు, "భలే భలే — అలా చేస్తే అక్క కంటే నేనే అందగత్తె నవుతాను!" అంటూ సంతోషించింది.

రాయవరపు ఆదినారాయణరావు



ఈ మాటలు సీత విన్నది. గుండె గుభీల్మ నగా రాత్రికి రాత్రి ఇల్లు విడిచిపెట్టి సమీపా రణ్యంలో ప్రవేశించి, కొంతదూరం నడిచాక అలసట ఎక్కువై, ఒక చెట్టు కింద విశ్రమించి ఒళ్ళెరక్కుండా నిద్రపోయింది.

బారెడు పొద్దెక్కాక సీతకు మెలకువవచ్చి చూస్తే, వికృతాకారుడొకడు ఆ చెట్టు చుట్టూ కాపలా కాస్తున్నాడు. ఒకరాత్రివేళ చిరుత పులి ఆమెపైకి దుముకబోతూండగా చూసి, వాడు దాన్ని తరిమేసి అప్పటి నుంచీ ఆమెకే అపాయమూ రాకుండా కాపలా కాస్తున్నాట్ట! సీత వాడికి తన కృతజ్ఞతలు చెప్పుకున్నది.

"నాకు నువ్వంటే ఇష్టమయింది. మనం పెళ్ళిచేసుకుందాం. హాయిగా పట్నం వెళ్ళి వుందాం," అన్నాడు వికృతాకారుడు. సీతకు వికృతాకారుడు నచ్చలేదు. తనను రక్షించిన వాడు కాబట్టి ఏమీ అనలేక, "నేను తప్పక నిన్ను పెళ్ళి చేసుకునేదాన్నే! కానీ నేనీ అర ణ్యాని కొచ్చినదెందుకనుకున్నావు? ఒక రాక్ష సుణ్ణి పెళ్ళి చేసుకుందామని ఇలా వచ్చాను. ఎందుకంటే, నా జాతకచక్రం ప్రకారం నేను రాక్షసుణ్ణి పెళ్ళి చేసుకోవాలి!" అని చెప్పింది వాడితో,

"ఆ రాక్షసుడెవడో తక్షణం కంట బడితే బాగుణ్ణు! ఒక్క కత్తివేటుతో వాణ్ణి నాలుగు ముక్కలుగా నరికి, నిన్ను పెళ్ళి చేసుకోగలను," అన్నాడు వికృతాకారుడు దర్పంగా.

అంతే! ఆ మరుక్షణం, "ఇదె వచ్చె!" అంటూ ఒకరాక్షసుడువాళ్ళముందుప్రత్యక్షమయ్యాడు. వాడికళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

వాడు వికృతాకారుడితో, "నువ్వు కోరిన మరుక్షణం కంటబడ్డాను! నువ్వు నన్ను చంపి, ఈ అమ్మాయిని పెళ్ళిచేసుకో. లేదా నేనే నిన్ను చంపిఈపిల్లనుపెళ్ళిచేసుకుంటాను,"అన్నాడు.

అక్కడికి నిజంగానే రాక్షసుడు రావడంతో బెదిరిపోయిన సీత, పెద్దగా కేక పెట్టి మూర్ఛ పోయింది. వికృతాకారుడు, రాక్షసుణ్ణి నిలు వెల్లా ఒకసారి పరీక్షగా చూసి, "ఛీ, రాక్షసుడితో పోరాడ్డానికి నేనేమైనా పిరికి పారుబోతునా!" అంటూ అక్కణ్ణించి పారిపోయాడు.

రాక్షసుడు శీతలోపచారాలు చేసి సీతకు స్పృహ తెప్పించి, "నన్ను చూసి భయపడకు.

నేను నిన్నేమీ చేయను. నీ మాటలు విన్నాక నాకు నీ మీద ప్రేమ పుట్టింది. మనం పెళ్ళి చేసుకుందాం," అన్నాడు.

కాస్త తేరుకోగానే సీత, "నువ్వేమో పర్వతాకారుడైన రాక్షసుడివి. నేనేమో పిచికపిట్టను. మనకు పెళ్ళెలా వీలవుతుంది? నలుగురూ మన జంటను చూసినవ్వరా?" అన్నది.

"నాకు కామరూప విద్య తెలుసు. నీ కోసం నవమన్మథాకారుడైన మానవుడి రూపం ధరించగలను," అంటూ రాక్షసుడు వెంటనే అందాల యువకుడుగా మారిపోయాడు.

అప్పటికీ సీతకు వాడు రాక్షసుడన్న భయం మనసులోంచి పోలేదు. వాడినెలా వదుల్చుకోవాలో తెలియక, "నేనుతల్లిచాటుపిల్లను. నా పెళ్ళికి అమ్మను ఒప్పించు," అన్నది.

రాక్షసుడు సరేనని సీతను తీసుకుని ఆమె ఊరికి బయల్దేరాడు. సీత వేగంగా నడవలేకపోతున్నదని, ఆమెను భుజాల మీద కూర్చోబెట్టుకుని సునాయాసంగా మోస్తూ, ఒక్క పరుగున ఆమె ఇంటికి చేరాడు.

సీత చప్పున రాక్షసుడి భుజాల నుంచి దిగి, ఇంట్లోకి వెళ్ళి, "పిన్నీ! వాడెవడో రాక్షసుడి లాంటి వాడు నన్నే పెళ్ళాడుతానని, నా వెంట బడ్డాడు. నన్ను రక్షించు!" అంటూ రమణమ్మకు చెప్పుకున్నది.

సవతితల్లికి రాక్షసులు కూడా భయపడతారని సీత నమ్మకం. రమణమ్మ ఆ మాటలు వినకుండా వెంటనే సీత జుట్టు పట్టుకుని, "రాత్రంతా చెప్పకుండా ఎక్కడికి పోయావే?" అంటూ గద్దించింది.





ముగ్ధురాలై, "నువ్వు నా కూతురు గీతను పెళ్ళి చేసుకోరాదూ, అప్పుడు నేనే నువ్వు చెప్పే మాటలు వింటాను," అన్నది.

రాక్షసుడు తల అడ్డంగా ఊపి, "పూర్వ జన్మలో రామబాణానికి చచ్చిన రాక్షసుణ్ణి. నాది ఒకే మాట.నాకుఒకే భార్య.నేనుసీతనే పెళ్ళిచేసుకుంటాను," అన్నాడు.

"అన్నింటికీ నీ ఇష్టం కుదరదు. నేను మూడు పనులు చెబుతాను. అవి చేయగలిగితే, నీ పెళ్ళి నీ ఇష్టప్రకారం జరుగుతుంది. లేకుంటే నా ఇష్టప్రకారం. సరేనా?" అన్నది రమణమ్మ.

"అయితే, ఒక విషయం గుర్తుంచుకో! ఇంట్లో చెత్తాచెదారం గురించి మాత్రం, నాకే పనీ చెప్పకూడదు. అందువల్ల నీకే ప్రమాదం," అన్నాడు రాక్షసుడు.

రమణమ్మ వాడి మాటలు పట్టించుకోకుండా,వాడికినిలువెత్తుగుండిగనుచూపించి, గంటలో దాన్నిండా నీళ్ళునింపాలని చెప్పింది.

ఆ గుండిగ పూర్వకాలానిది. ఇంట్లో మనుషులు ఎక్కువగా వుండే రోజుల్లో, నీళ్ళు దాంట్లో నిలవుంచుకునే వారు. అది పూర్తిగా నిండాలంటే ఒక పూటల్లా బావినీళ్ళు తోడక తప్పదు.

రమణమ్మ చెప్పిన మరుక్షణం, రాక్షసుడా గుండిగను దొర్లించుకుంటూ బావి దగ్గరకు వెళ్ళాడు. అక్కడ వాడు దాన్ని రెండు చేతులతోనూ పట్టుకుని నూతిలోకి దూకాడు. ఆ

అంతలో రాక్షసుడు ఇంట్లోకి ప్రవేశించి, అది చూసి, "ఏయ్, ముసలిదానా! సీతను విడిచిపెట్టు. ఆ పిల్ల ఒంటి మీద ఈగ వాలినా, నిన్ను ఈగను నలిపి నట్టు నలిపేస్తాను," అన్నాడు.

రమణమ్మ హడలిపోయి సీతను విడిచిపెట్టి,రాక్షసుడి వంక చూసి, "ఎవరు నువ్వు? నా ఇంట్లో అడుగుపెట్టి నన్నే బెదిరిస్తున్నావు?" అన్నది.

"నేను నీ కూతురు సీతను ప్రేమించాను. మా పెళ్ళికి నీ అనుమతి కావాలి. అందుకు నువ్వేంచెబితే అది చేస్తాను," అన్నాడు రాక్షసుడు. వాడు రాక్షసుడని తెలియకపోవడంవల్ల రమణమ్మ, ఆయువకుడి రూపసౌందర్యానికి



తర్వాత కొద్ది క్షణాల్లో, ఆ గుండిగను భుజాల మీద మోసుకుంటూ బావి బయటకు వచ్చి, దాన్ని ఒక పక్కగా పెట్టి ఇంటిలోపలికి వెళ్ళి, "అత్తయ్యా! నీళ్ళగుండిగను బావి పక్కనే వుంచేదా?" అని అడిగాడు.

వాడెందుకలా అడిగాడో తెలియక, రమణమ్మ బావి దగ్గరకు వెళ్ళి గుండిగనిండా నీళ్ళుండడం చూసి అదిరిపడింది.

రాక్షసుడు నవ్వుతూ, "నీళ్ళ గుండిగను ఇంట్లో పెట్టాలంటే చెప్పు. అది నీ రెండవ పని అవుతుంది," అన్నాడు.

రమణమ్మ తేరుకుని, "నీకు కండబలం బాగానే వుంది. ఇక నీ బుద్ధిబలాన్ని పరీక్షించాలి. మా ఇల్లంతా చిందరవందరగా వుంది. ఏ సామానెక్కడుండాలో అక్కడుండేలా, ఇల్లంతా గంటలో సర్దిపెట్టగలవా?" అని ప్రశ్నించింది.

"అదెంత సేపు? కాసేపు మీరంతా బయటకు వెళ్ళండి!" అన్నాడు రాక్షసుడు.

అందరూ బయటికి వెళ్ళిన కొద్ది సేపటికే, వాళ్ళకు రాక్షసుడి నుంచి పిలుపు వచ్చింది. వాళ్ళు వచ్చి చూస్తే, ఇంటి స్వరూపమే మారి పోయింది. ఎన్నోబరువైన రోళ్ళు, ఇతర వస్తువులు, ఇనుప పెట్టెలు, ధాన్యం బస్తాలు అటక మీదికి చేరిపోయాయి. ఇంట్లో సమయానికి అక్కరకు వచ్చే వస్తువులన్నీ చేతికి అందుబాటులో వున్నాయి. ఇల్లంతా తీర్చిదిద్దినట్టుగా వుంది.

రమణమ్మ, రాక్షసుడిసమర్థతనుమనసులో మెచ్చుకోకుండా వుండలేకపోయింది. అయితే, ఇంట్లో చాలా చోట్ల చెత్తాచెదారం అలాగే పడివున్నది.

"ఇంత చేశావు, ఇంట్లో వున్న చెత్తాచెదారం తీసెయ్యలేక పోయావా? ఇదేనా నీ చాకచక్యం?" అంటూ రమణమ్మ, రాక్షసుణ్ణి ఎద్దేవా చేసింది.

"అది నీ పని! ఆ పని నాకు చెబితే, నీకే ప్రమాదమని ముందే చెప్పాను," అన్నాడు రాక్షసుడు. "తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవు. మా అమ్మ ఏం చెబితే అది చేస్తానన్నావు. చేశావా సరేసరి, లేదా ఓడానని ఒప్పుకో!" అన్నది గీత కోపంగా.

అప్పుడు రాక్షసుడు, రమణమ్మతో, "ఎవరి పనులు వాళ్ళు చేసుకోవడం అన్నివిధాలా మంచిది. ఎవరో పెళ్ళికి రాక్షసుణ్ణి ఆహ్వానించి, నీక్కావలసినదంతా తినమంటే, వచ్చిన అతిథులెవ్వరికీ విందుభోజనం మిగలకుండా తినేశాడట! నీ పని నేను చేయడం నీకే ప్రమాదం. అయినా ఫర్వాలేదంటే చెప్పు, చేస్తాను," అన్నాడు.

"ఈ ఇంట్లో వున్న చెత్తాచెదారాన్నంతా బయటికి విసిరేసెయ్. ఈమూడోపనిచేస్తేనే, నువ్వు గెలిచినట్లు," అన్నది రమణమ్మ మొండిగా.

దానికి రాక్షసుడు తమాషాగా నవ్వి, "నా దృష్టిలో ఈ ఇంట్లోనిచెత్తాచెదారం — నువ్వూ, నీకూతురే!" అంటూ ఇద్దర్నీ చెరో చేత్తో పట్టుకుని దూరంగా విసిరేసి, సీతతో, "నేవిసిరిన విసురుకు వాళ్ళిద్దరూ అలా గాలిలో రివ్వుమంటూ పోయి, ఎక్కడో పడి ప్రాణాలు విడిచే వుంటారు. ఒకవేళ బ్రతికున్నా, ఇక ఈ జన్మకు ఇక్కడికి రారు," అన్నాడు.

సీత ఆశ్చర్యంగా రాక్షసుడి వంకే చూస్తూ, "నీలో వాళ్ళను చంపగల శక్తి వుండికూడా, ముందుగామాపిన్నిచెప్పినపనులన్నీఎందుకు చేశావు?" అని అడిగింది.

రాక్షసుడు ఒక క్షణం మౌనంగా వూరుకుని, "నాకు నువ్వంటే ఇష్టం. నువ్వు మీ అమ్మ అనుమతి లేనిదే నన్ను చేసుకోనన్నావు. నీ కోసం నేను వాళ్ళు చెప్పిన పనులన్నీ చేశాను. అలా చేస్తూనే చెత్తాచెదారం గురించి వాళ్ళను ముందుగా హెచ్చరించాను. మూర్ఖులు, దుర్మార్గులు ముందుగా హెచ్చరించినా తమకు వచ్చే ప్రమాదాన్ని తప్పించుకోలేరని నాకు తెలుసు. అందుకే వాళ్ళనోటితోనే, నా చేతిలో వాళ్ళు అంతమయ్యేలా అడిగించాను. అర్థమయిందా?" అన్నాడు.

సీత అర్థమయిందన్నట్టు తల వూపింది. మనిషి అయ్యుండీ తన ముఖం మీద మరిగే నూనె పోద్దామనుకున్న సవతితల్లితో అన్నేళ్ళు జీవించిన తను — తనకోసం ఏమైనా చేయగల శక్తివంతుడైన రాక్షసుడికి భయపడడం అవివేకమనిగ్రహించినసీత, అందమైన యువకుడుగా మారినరాక్షసుణ్ణినిస్సంకోచంగా పెళ్ళి చేసుకుని కలకాలం సుఖంగా జీవించింది.






ఫ్రిజియా అనే దేశంలో ట్రోయ్ అనే నగరానికి వర్ధనుడు రాజుగా ఉండేవాడు. ఆయన భార్య గర్భిణిగా ఉండి ఒక కల కన్నది. ఆ కలలో ఆమెకు తన గర్భాన ఒక కొరివి పుట్టినట్టూ, దాని నుంచి బయలుదేరిన అగ్నికీలలు ట్రోయ్ నగరాన్ని తగల పెట్టేసినట్టూ కనిపించింది. ఆమె భయంతో కేకలు పెడుతూ నిద్రలేచి, తన కలను గురించి భర్తకు చెప్పేసింది.

వర్ధనుడి కొడుకులలో జ్ఞాని అనేవాడు రానున్నది చెప్పగలవాడు. అందుచేత వర్ధనుడు జ్ఞానికి కలను గురించి చెప్పాడు. "పుట్టబోయే వాడు నగరానికి అరిష్టం తెస్తాడు. అందుచేత వాడు పుట్టగానే చంపించు!" అని జ్ఞాని సలహా ఇచ్చాడు.

ఒకనాడు చీకటి పడబోతూన్న సమయాన వర్ధనుడి భార్య ఒక మగ శిశువును కన్నది. ఆ శిశువును వెంటనే చంపెయ్యక, వర్ధనుడు ఆ పని చేసే భారాన్ని తన పశువుల మందల నాయకుడి పైన వేశాడు. పసులకాపరి తన మందలతోసహా ఐడా పర్వతం మీద వుంటూ వుంటాడు. అతను రాజాజ్ఞ ప్రకారం శిశువును తీసుకుని ఐడా పర్వతానికి వెళ్ళిపోయాడు.

కాని ఆ పసిపాపను చంపటానికి పసుల కాపరికి చేతులు రాలేదు. అతను ఆ శిశువును ఒక శిఖరం మీద చావటానికి వదిలేసి తన ఇంటికి వెళ్ళిపోయాడు. కాని ఆ శిశువు చావలేదు. ఎక్కడి నుంచో ఒక ఆడ ఎలుగుబంటి వచ్చి ఆ దిక్కులేని శిశువుకు తన పాలిచ్చి, ఎండనుంచీ, చలినుంచీ కాపాడింది.

గ్రీకు పురాణగాథ



సౌందర్యమూ పొడకట్టాయి. అతనింకా బాలుడుగా ఉండగానే కొందరు దొంగలు అతను కాసే గోవులను కాజేశారు. మోహనుడు ఒంటరిగా దొంగల మీద పడి, వాళ్ళను తరిమికొట్టి, తన గోవులను తిరిగి తెచ్చుకున్నాడు.

తన మందలో ఉండే ఎద్దులకు పోట్లాట పెట్టటం మోహనుడికి సరదా, పోట్లాటలో గెలిచినదాని కొమ్ములకు పూలూ, ఓడిన దాని కొమ్ములకు గడ్డీ చుట్టేవాడు. తన ఎద్దులలో ఏదైనా మిగిలిన వాటన్నిటినీ ఓడించినప్పుడు, అతను దాన్ని ఇతర మందలలోని ఎడ్లమీద పోటీ పెట్టేవాడు. పందెంలో తన ఎద్దును ఓడించినదాని కొమ్ములకు బంగారు తొడుగు బహుమానం ఇస్తాననేవాడు.

అయిదు రోజుల అనంతరం పసుల కాపరి తిరిగి ఆ శిఖరానికి వెళ్ళి ఎలుగుబంటి సంరక్షణలో సుఖంగా వున్న శిశువును చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు. అతనికి ఇదేదో దైవమాయ అనిపించింది. ఆ శిశువుకు చచ్చే యోగం లేనట్టు కనబడింది. ఎలుగుబంటి ఎడంగా పోగానే ఆ పసులకాపరి ఆ శిశువును తన సంచీలో పెట్టి ఇంటికి తెచ్చుకుని సాకసాగాడు. చాలా అందంగా ఉండటం చేత ఆ శిశువుకు మోహనుడు అనే పేరు వచ్చింది.

ఈ విధంగా చావు తప్పించుకున్న మోహనుడు, పసులకాపరి ఇంట పెరుగుతూ పెద్దవాడు కాసాగాడు. బాల్యంనుంచి కూడా అతనిలో గొప్ప తెలివితేటలూ, శరీర బలమూ,

☆☆☆☆

ఐడా పర్వతం మీద మోహనుడు పసుల కాపరి జీవితం గడుపుతున్న సమయంలో దేవలోకంలో ఒక చిత్రం జరిగింది. ఒకచోట పెళ్ళి జరుగుతూండగా అనేకమంది దేవతలు చేరారు. ఆ సమయంలో కలహప్రియ అనే దేవత అతిథుల మధ్య ఒక బంగారు ఫలం పడేసింది. ఆ పండు పైన "అత్యంత సౌందర్యవతికి!" అని రాసి వుంది. పెళ్ళికి అతిథులుగా వచ్చిన ఆడదేవతలలో ముగ్గురు మాత్రమే ఆ పండు కోసం పోటీ పడ్డారు. వారెవరంటే, భూపుత్రి, బుద్ధిమతి, కామిని.

ఆ ముగ్గురిలోనూ ఉత్తమ సౌందర్యవతి ఎవరో తేల్చినవారు లేకపోయారు. ఆ కారణం

చేత వారు నేరుగా దేవనాథుడి వద్దకు వెళ్ళి, తమ ముగ్గురిలో అత్యంత సౌందర్యవతి ఎవరో తీర్పు ఇవ్వమన్నారు.

"ఈ తీర్పు నావల్ల అయ్యేది కాదు. ఐడా పర్వతం మీద ఉంటున్న మోహనుడి వద్దకు వెళ్ళి మీ తగాదా పరిష్కారం చేసుకోండి!" అని దేవనాథుడు ఆ ముగ్గురికీ సలహా ఇచ్చాడు.

ముగ్గురు అప్సరసలూ ఐడా పర్వతం మీదికి చేరే సమయాన మోహనుడు ఆ పర్వతంపై గల శిఖరాలలోకల్లా ఎత్తయిన శిఖరం మీద గోవులను మేపుతున్నాడు. వారు అతన్ని సమీపించి బంగారు ఫలం అతని చేతిలో పెట్టి, "మోహనా, నువ్వు కూడా అందగాడవు, బుద్ధిమంతుడవు. మాలో ఎవరి అందం గొప్పదో నిర్ణయించి ఈ ఫలం వారికి ఇయ్యి. ఇది దేవనాథుడి ఆజ్ఞ!" అన్నారు.

"నేను పశువులను మేపుకునే సామాన్య మానవుణ్ణి. నాకు దేవతాసౌందర్యం ఏం తెలుసు? ఈ పని నావల్ల ఏమవుతుంది? కావలిస్తే ఈ పండును మూడు సమ భాగాలుగా కోసి ఇస్తాను, ముగ్గురూ మూడు ముక్కలు తీసుకోండి," అని మోహనుడు అమాయికత్వం నటించాడు.

"ఇది దేవనాథుడి ఆజ్ఞ! జవదాటితే ప్రమాదం!" అని ఆ ముగ్గురూ, మోహనుణ్ణి భయపెట్టారు.




"అయితే నిర్ణయిస్తాను. మీరు నా నిర్ణయానికి తలఒగ్గాలి గాని, ఓడినవారు నామీద ఆగ్రహించకూడదు. మానవమాత్రుడి నైన నేను పొరపాటు నిర్ణయిస్తే మీరు సహించాలి," అన్నాడు మోహనుడు.

ఇందుకు ముగ్గురూ ఆమోదించారు.

"మీరు ముగ్గురూ ఒక్కసారి కనబడుతుంటే నేను ఏ ఒకరినీ సరిగా చూడలేకుండా ఉన్నాను. అందుచేత మీరు దూరంగా వెళ్ళిపోయి, ఒక్కొక్కరుగా నా దగ్గిరికి రండి!" అన్నాడు మోహనుడు.

ముగ్గురూ చాటుకు వెళ్ళిపోయారు. మొదట భూపుత్రి అతని వద్దకు వచ్చింది. అతను తన అందం పరీక్షించటానికి గాను

ఆమె గుండ్రగా తిరుగుతూ, "చూడు, మోహనా! ఆ పండు నాకిచ్చావంటే ఏ యుద్ధంలోనూ నీకు అపజయమన్నది లేకుండా చేస్తాను. అందంలోగాని, తెలివిలోగాని ప్రపంచంలో నీతో సమానుడు లేకుండా వరమిస్తాను," అన్నది.

"నేను గొడ్లకాపరిని, తల్లీ! నాకు యుద్ధాలెందుకు? విజయాలెందుకు?" అన్నాడు మోహనుడు.

ఆమె వెళ్ళిపోయి, బుద్ధిమతి వచ్చింది. "మోహనా, ముగ్గురిలోనూ నేనే సౌందర్యవతిగా నిర్ణయించావంటే, నిన్ను ఆసియా కంతకూ రాజు చేస్తాను. ప్రపంచంలోకల్లా నీకన్న ధనికుడు లేకుండా వరమిస్తాను!" అన్నది ఆమె అతనితో.

"నేను లంచం పుచ్చుకుని తగాదా పరిష్కరించను.క్షమించండి!" అన్నాడు మోహనుడు.

కామిని ఆఖరున వచ్చింది. ఆమె అతన్ని చూస్తూ, "అయ్యో, మోహనా, ఫ్రిజియా మొత్తం మీద నీ అంత అందగాడు లేడు! అటువంటి వాడికి నిజంగా, స్పార్టాదేశపు రాజకుమార్తె భువనసుందరి భార్య కాతగినది. ఆమెను మించిన సౌందర్యవతి భూలోకంలో లేదు!" అన్నది.

"ఆమెపేరే వినలేదు,"అన్నాడుమోహనుడు.

"వినలేదా? గ్రీస్‌లో ఉండే రాజకుమారులందరూ ఆమెను పెళ్ళాడతామని వచ్చారు. కాని ఆమె రారాజు తమ్ముడైన ప్రతాపుణ్ణి పెళ్ళాడేసింది. కావాలంటే ఆమె నీకు లభిస్తుంది!" అన్నది కామిని.



"ఆమెకు అదివరకే వివాహమయిందిగా, నాకెలా లభిస్తుంది?" అన్నాడు మోహనుడు

కామిని నవ్వి, "ఏమైతే? నిన్ను చూడగానే నీపై ఆమెకు ప్రేమ కలిగేటట్టు నేను చెయ్య గలను. ఆ తరవాత ఆమె ఇల్లూ, వాకిలీ, భర్తా, సంసారమూ అన్నీ మరిచి నీవెంట వచ్చేస్తుంది," అన్నది.

"భువనసుందరి నిజంగా అంత అంద గత్తేనా?" అన్నాడు మోహనుడు.

"పిచ్చివాడా, ఆమె సౌందర్యం నా సౌందర్యా నికి ఏమీ తగ్గదు," అన్నది కామిని నవ్వుతూ.

"ఆమెను నా కిప్పిస్తానని ప్రమాణం చేస్తావా?" అన్నాడు మోహనుడు.

కామిని ప్రమాణం చేసింది. మోహనుడు బంగారు ఫలాన్ని ఆమెకు బహూకరించాడు. ఇందువల్ల మిగిలిన ఇద్దరు అప్సరసలకూ అతనిపై ఎంతో ఆగ్రహం కలిగింది. కాని వారు అతని తీర్పుకు బద్ధులమై ఉంటామని మాట ఇచ్చి ఉండటం చేత తమ ఆగ్రహాన్ని దిగమింగుకున్నారు.

☆☆☆☆

భువనసుందరి నిజంగానే అపురూప సౌందర్య వతి. అమితమైన సౌకుమార్యం గలది. ఆమె సాక్షాత్తూ దేవనాథుడికీ, మానిని అనే ఆమెకూ పుట్టింది. ఆమె ఒక హంస గుడ్డులో నుంచి పుట్టి వచ్చిందని ప్రతీతి. బాల్యం నుంచీ ఆమెను స్పార్టా రాజైన మర్దనుడు పెంచి పెద్దదాన్ని చేశాడు. ఆమెకు పెళ్ళి చేయదగిన వయసు వచ్చే సరికి గ్రీసులో ఉన్న ఎంతోమంది రాకుమారులు ఆమెను





వాడు రూపధరుడు ఒకడే. అతను మర్దనుడి వద్దకు వెళ్ళి, "మీకు పెద్ద చిక్కు వచ్చిపడిం దని నేనెరుగుదును. నాకు మీరు ఒక్క సహాయం చెయ్యండి, నేను మీకు వచ్చిన చిక్కు విడే ఉపాయం చెబుతాను," అన్నాడు.

"నీకు నేనేమి సహాయం చెయ్యాలి? నువ్వు నా చిక్కు ఎలా విడగొడతావు?" అని స్పార్టా రాజు మర్దనుడు అడిగాడు.

"మీ సోదరుడైన చంద్రదత్తుడి కుమార్తె పద్మముఖిని ఎలాగైనా నాకు పెళ్ళిచేసేటట్టు చూడండి. మీ కుమార్తెను ఎవరికిచ్చి పెళ్ళి చేసినా మిగిలినవాళ్ళు తగాదా పెట్టకుండా నేనొక ఉపాయం చెబుతాను," అన్నాడు రూపధరుడు.

పెళ్ళాడగోరి స్పార్టాకు వచ్చారు. అలా వచ్చిన వారిలో దేవమయుడు, ప్రతాపుడు, భూధవుడు, రూపధరుడు మొదలైనవారున్నారు. వీరిలో రూపధరుడు ఒక్కడే ఉత్తచేతులతో వచ్చాడు; మిగిలిన వారంతా భువనసుందరికి అంతులేని కానుకలు తెచ్చారు.

మర్దనుడికి పెద్ద చిక్కే వచ్చిపడింది. ఇందరిలో భువనసుందరిని ఎవరికని ఇవ్వటం? ఎవరికిచ్చినా మిగిలినవారంతా కయ్యానికి రావచ్చు. అందుచేత ఆయన ఏ ఒక్కరికీ తన కుమార్తె నివ్వననీ చెప్పలేదు, ఎవరు తెచ్చిన కానుకలనూ స్వీకరించనూ లేదు.

తనకు భువనసుందరి నిచ్చి పెళ్ళిచెయ్యరని మొట్టమొదటి నుంచీ స్పష్టంగా తెలిసిన

"నీ ఉపాయం చెప్పు. నీకు పద్మముఖిని ఇచ్చి పెళ్ళిచేసే పూచీ నాది," అని మర్దనుడు మాట ఇచ్చాడు.

"అయితే, ఇలా చేయండి. భువనసుందరిని పెళ్ళాడగోరి వచ్చిన రాకుమారులందరినీ పిలవండి. ఆమెను ఎవరు పెళ్ళాడినా సరే, వాడికి ఇంకొకడి వల్ల ప్రమాదం వచ్చే పక్షాన మిగిలినవారంతా ఆమె భర్తకు సాయం వచ్చేటట్టు అందరిచేతా ప్రమాణం చేయించండి. అలా చేసినట్టయితే ఆమె వివాహం సాఫీగా, ఎట్టి పేచీలూ లేకుండా సాగిపోతుంది," అన్నాడు రూపధరుడు.

ఈ సూచన మర్దనుడికి నచ్చింది. ఆయన గ్రీకు రాకుమారులందరినీ పిలిపించి, "మీరం

తాభువనసుందరిని పెళ్ళాడగోరుతున్నవారే. అయితే, ఆమె మీలో ఒక్కరిని మాత్రమే పెళ్ళాడ గలదు. ఆమె ఎవరినైతే పెళ్ళాడు తుందో అతనిమీద మీలో అసూయాపరుడెవ డైనా ఉండి కత్తికట్టవచ్చు. అలా జరిగే పక్షంలో మీరంతా ఆమె భర్తకు సహాయం వెళతామని ప్రమాణం చెయ్యండి. ఆ తరవాత ఆమెకు భర్తను నిర్ణయిస్తాను," అన్నాడు.

రాకుమారులందరూ ఆయన కోరిన ప్రకారం ప్రమాణాలు చేశారు. ఆ తరవాత భువనసుందరిని ప్రతాపుడికిచ్చి మర్దనుడు పెళ్ళిచేశాడు. కొంతకాలం గడిచాక అతడు గతించాడు. అతడి స్థానంలో ప్రతాపుడు స్పార్టాకు రాజయ్యాడు.

భువనసుందరి వివాహం జరిగినప్పుడే, స్పార్టాలో రూపధరుడికీ, పద్మముఖికీ కూడా వివాహం జరిగింది. పద్మముఖితండ్రి అయిన చంద్రదత్తుడు తన అల్లుడితో, "బాబూ, నా కుమార్తెను విడిచి ఉండలేను. నువ్వు స్పార్టాలోనే ఉండిపో!" అన్నాడు. కానీ ఇందుకు రూపధరుడు ఎంతమాత్రం ఒప్పక, భార్యతోసహా తన తేరు ఎక్కి ఇథాకాకు బయలుదేరాడు. చంద్రదత్తుడు వెర్రివాడు లాగా రథం వెంట పరిగెత్తుతూ, "నా తల్లీ, వెళ్ళిపోకు! వెళ్ళిపోకు!" అని కేకలు పెట్ట సాగాడు.

మామగారి ఈ ప్రవర్తనను రూపధరుడు ఎంతోసేపు సహించలేక పోయాడు. అతను తన భార్యవేపు తిరిగి, "ఏమిటిది? నువ్వు వస్తే బుద్ధిపూర్వకంగా నావెంట వచ్చెయ్యి. లేదా, నన్ను విడిచిపెట్టి, మీ నాన్న వెంట తిరిగిపో!" అన్నాడు.

పద్మముఖి ఏ సమాధానమూ చెప్పక, తన నెత్తిమీది మేలిముసుగు ముఖం మీదికి లాక్కున్నది.

ఇది చూసి చంద్రదత్తుడు తప్పు తనదే ననీ, భర్తవెంట వెళ్ళిపోవటం తన కుమార్తె ధర్మమనీ తెలుసుకున్నాడు. ఈ సంఘటన జరిగిన చోట ఆయన తన కుమార్తె శిలా ప్రతిమ ఒకటి స్థాపించాడు. ఈ ప్రతిమ స్పార్టా నగరానికి నాలుగు మైళ్ళ దూరాన ఇప్పటికీ ఉన్నది. —(ఇంకావుంది)



# మంచిముహూర్తం

అల్లినగరంలో వుండే గోవిందయ్యకు జాతకాలన్నా, ముహూర్తాలన్నా, శకునాలన్నా చాలా నమ్మకం. ఒకనాడు అతను అతిముఖ్యమైన పనిమీద ఇంటి నుంచి బయటకు రాగానే ఎవరో తుమ్మారు. గోవిందయ్య ఆ తుమ్మినవాణ్ణి తిట్టుకుంటూ, తిరిగి ఇంట్లోకి పోబోతూ, పొరుగింటి పరమేశ్వరశాస్త్రి ఎక్కడికో వెళుతూండడం గమనించి ఆశ్చర్యపోయాడు. ఆయన ఎంత చిన్న పనికైనా ముహూర్తం చూసుకునే ప్రారంభిస్తాడు. ప్రయాణాలు కూడా అలాగే చేస్తాడు. అటువంటివాడు తుమ్మును కూడా లెక్కచేయకుండా వెళుతున్నాడంటే – ఇదేదో గొప్ప ముహూర్తం అని భావించి, గోవిందయ్య ఆగకుండా తన పనిమీద వెళ్ళిపోయాడు.

గోవిందయ్య వెళ్ళిన పని దిగ్విజయంగా నెరవేరడంతో, మర్నాడు, అడక్కుండానే అంత మంచిముహూర్తం తెలియబరచిన పరమేశ్వరశాస్త్రికి కృతజ్ఞత చెప్పడానికి వెళ్ళాడు.

గోవిందయ్య చెప్పినది విన్న పరమేశ్వరశాస్త్రి ఆశ్చర్యపోయి, "ఈమధ్య నాకు పరధ్యానం ఎక్కువయింది. అందువల్లనే తుమ్ము నాకు వినబడలేదనుకుంటాను. అయినా ఆ సమయంలో నేను బయలుదేరింది ముఖ్యమైన పని మీద కాదు, గోడపక్కన చేరి అదే పనిగా మొరుగుతున్న కుక్కను తరిమేందుకు. రాహుకాలంలో ముఖ్యమైన పని మీద బయలుదేరడానికి నేను వెర్రివాడినా ఏమిటి?" అన్నాడు.

గోవిందయ్యకు నోట మాట రాలేదు. ఆ తర్వాత అతడేనాడూ శకునాలా, ముహూర్తాలా జోలికి పోలేదు.

– మాడుగుల రాము






# తపస్వి – పతివ్రత

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ భీతి గొలిపే ఈ శ్మశానంలో నువ్వు ఇన్ని శ్రమల కోర్చుతూ పట్టువిడవడం లేదంటే, అందుకు నువ్వు సాధించదలచిన కార్యం ఎంతో ఉన్నతమైనదై వుండాలి! అయితే, ఒక్కొక్కసారి స్వార్థపరులైన సామాన్య వ్యక్తులు, సర్వసంగపరిత్యాగులై మోక్షం కోసం పరితపించే తాపసులను కూడా భంగపరచగలరు. నువ్వు కూడా ఏదో ఒకనాడు అలాంటి భంగపాటుకు గురై అపహాస్యం పాలు కాకుండా తగు జాగ్రత్తలో వుండేందుకు గాను, ఒక తపస్వి – పతివ్రత గురించిన కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

## బేతాళ కథలు



హేమగిరి అనే గ్రామంలో ధీరుడనే యువకుడుండేవాడు. తల్లిదండ్రుల మితిమించిన గారాబం వల్ల వాడికి చెడుఅలవాట్లు అబ్బాయి. ఏళ్ళొచ్చాక బాగుపడక పోతాడా అని తల్లిదండ్రులనుకున్నారు కానీ అలా జరగలేదు. వాడు మరింత వ్యసనపరుడై తండ్రి సంపాదించిన ఆస్తిని వృధా చెయ్యసాగాడు.

చెడ్డ అలవాట్లకు లోనైన వారెందరో పెళ్ళయ్యాక బాగుపడడం ధీరుడి తల్లిదండ్రులకు తెలుసు. తమ కొడుకూ, అలా బాగుపడతాడని వాళ్ళు ఆశపడుతున్నారు. అయితే ధీరుడి గుణగణాలు తెలిసి, కలిగిన వాళ్ళెవ్వరూ పిల్లనివ్వరు. పేదవాళ్ళెవరైనా ఇచ్చినా ఆ పిల్లకు శాంతం, సహనం వుండాలి!

హేమగిరి పక్కనే రామవరం అనే గ్రామం వున్నది. ఆ గ్రామంలో పేరయ్య అనే పేద రైతుకు ఒక్కగా నొక్క కూతురు శాంత. పేరుకు తగ్గట్లే ఆమె శాంతానికీ, సహనానికీ మారురూపం. చిన్నతనం నుంచీ పురాణ కథలు చదివి మంచితనాన్నీ, పరోపకారబుద్ధినీ అలవరుచుకున్నది.

ఇలా వుండగా – శాంత తల్లి కాంతమ్మకు హఠాత్తుగా పెద్ద జబ్బు చేసింది. వైద్యుడు నూరు వరహాలు కావాలన్నాడు. పేరయ్య దగ్గర అంత డబ్బు లేదు. ఊళ్ళోవాళ్ళను చాలా మందిని అడిగి లేదనిపించుకున్నాక, అతడు దేవుడి మీద భారం వేసి వూరుకున్నాడు.

అయితే, శాంత అలా వూరుకోలేకపోయింది. రామవరం గ్రామపెద్దగారి భార్యకు రెండేళ్ళ క్రితం బాగా జబ్బు చేస్తే, శాంత మూడు వారాల పాటు వాళ్ళింట్లోనే వుండి ఆవిడకు సపర్యలు చేసింది. ఇందుకు గ్రామపెద్ద భార్య ఎంతో సంతోషించి శాంతతో, "కనీసం ఒక్కసారి నీకు కావలసిందిచ్చి నీ ఋణం తీర్చుకోవాలని వుంది. నీకేదైనా అవసరం వచ్చినప్పుడు నిస్సంకోచంగా వచ్చి అడుగు. అదెంత అసాధ్యమయిన కోరిక అయినా సరే – నేను తీరుస్తాను," అని చెప్పింది.

ఈ సంగతి గుర్తు చేయాలని శాంత గ్రామపెద్ద ఇంటికి వెళ్ళింది. అప్పుడక్కడ ధీరుడి

తండ్రి వున్నాడు. ఆయన శాంతను చూసి వివరాలడిగి తెలుసుకున్నాడు. ఆయనకామె అన్నివిధాలా నచ్చింది. వెంటనే తనే పూను కుని శాంత తల్లి కాంతమ్మకు వైద్యం చేయిం చాడు.

తర్వాత ఆయన, పేరయ్యకు ఊళ్ళో చిల్లర బాకీలుంటే అవికూడా తీర్చేసి, అత డితో, "ఈ ఊళ్ళో నాకు నాలుగెకరాల పొలం వున్నది. అది నువ్వే సాగుచేసుకో. అందుకు బదులుగా నీకూతుర్ని నా ఇంటి కోడలిని చెయ్యి," అన్నాడు.

అంతటి భాగ్యవంతుడలా నోరు విడిచి అడిగాడని పేరయ్యకు అనుమానం వచ్చి, ధీరుడి వివరాలడిగాడు. తండ్రి దాచకుండా కొడుకు గురించి అన్నీ చెప్పి, "నీ కూతురు వల్ల నీ దరిద్రం తీరుతుంది. నా కొడుకు బాగుపడతాడు. ఈ సంబంధం కాదనకు," అన్నాడు.

పేరయ్య అవుననడానికి తటపటాయిం చాడు. శాంత మాత్రం తల్లిదండ్రులకు మేలు జరుగుతుందన్న ఆశతో, ఈ పెళ్ళి తనకిష్టమే నని చెప్పింది.

శాంతకూ, ధీరుడికీ త్వరలోనే పెళ్ళి జరిగిపోయింది.

ముందు ధీరుడు పెళ్ళంటే భయపడ్డాడు. పెళ్ళాం చీటికీ మాటికీ తనను సాధించగలదని భయపడ్డాడు. కానీ శాంత తరహాయే వేరు. ఆమె వాడిని ఎక్కడికి వెళుతున్నావని గానీ,



ఏం చేస్తున్నావని గానీ ఒక్క ప్రశ్నకూడా వేసేదికాదు. వాడిని మనిషిలా కాక దేవుడిలా గౌరవించేది.

ధీరుడి తల్లిదండ్రులకు మాత్రం శాంత తరహా నచ్చలేదు. తమ కొడుకును అదుపు చేయడానికి బదులు మరింత పాడు చేస్తున్న దని వారికి తోచింది. ఒకరోజున వాళ్ళిద్దరూ ఆమెకు హితవుచెపుతూ, "నువ్వు ఉపేక్షిం చడం వల్ల వాడు మరింత పాడైపోతున్నాడు. ఇలాగైతే మనమందరం సర్వనాశనమై పోతాం. సమయం చూసి నువ్వు వాడి బుద్ధి మార్చే ప్రయత్నం చెయ్యి," అన్నారు.

శాంత తల అడ్డంగా వూపి, "మీరు పెద్దలు. మీ మాట నేను వినాలి. కానీ నా భర్త నాకు



దేవుడు. ఆయనను సేవించుకుని పతివ్రతా ధర్మం నిర్వహిస్తున్నాను. నాకు ఆయన తర్వాతే మీరందరూ. అందువల్ల ఆయన విషయంలో తప్ప మిగతా అన్నివిషయాల్లోనూ నేను మీ మాటలు తప్పక వింటాను," అని చెప్పింది.

ఆమెకు ఇక ఏమీ చెప్పలేక అత్తమామలు వూరుకున్నారు.

కొన్నాళ్ళ తర్వాత ధీరుడి ఆరోగ్యం పాడయింది. వాడు మంచం పట్టాడు. వైద్యుడు వచ్చి చూసి, "దుర్వ్యసనాల వల్ల వీడి ఆరోగ్యంపాడయింది, ఏమందులూ వీడిని బాగు చేయలేవు. ఇక వీడి జీవితమింతే!" అని వెళ్ళిపోయాడు.

శాంత మాత్రం భర్త పరిస్థితికి ఏవగించుకోక సకల సపర్యలూ చేయసాగింది. వాడి తల్లిదండ్రులు కొడుకు ఆరోగ్యం కోసం సాధువుల చుట్టూ, బైరాగుల చుట్టూ తిరగ సాగారు.

ఒకరోజున బైరాగి ఒకడు వాళ్ళతో, "మీ కోడలు గనక మహాపతివ్రత అయితే, మీ అబ్బాయి మామూలు మనిషి కావడం కష్టం కాదు. హేమగిరి పక్కనే వున్న అరణ్యంలో రాముని కొలను ఒకటుంది. ఆ కొలను ఒడ్డున మామిడి చెట్టొకటున్నది. ఆ చెట్టు వేరు ఎలాంటి జబ్బులనైనా నయం చేస్తుంది," అన్నాడు.

"మా కోడలు మహాపతివ్రత అనడంలో సందేహం లేదు. నేనా వేరును తెస్తాను," అన్నాడు ధీరుడి తండ్రి.

బైరాగి నవ్వి, "ఆ వేరును పరులు తాకరాదు. మీ కోడలు భర్తను తట్టలో వుంచి, ఆ తట్టను మోసుకుంటూ ఎవరి సాయమూ లేకుండా రాముని కొలను చేరుకోవాలి. అక్కడున్న మామిడి చెట్టు కింద ముని ఒకడు తపస్సు చేసుకుంటూంటాడు. ఆయన తపఃప్రభావం వల్లనే, ఆ చెట్టు వేరు మహిమ గలదయింది. మీ కోడలు స్వయంగా గొడ్డలితో ఆ చెట్టును నరికి, మొదలంటా పెళ్ళగించి వేరును తీసి భర్తకివ్వాలి. అది నమిలితే మీ అబ్బాయి తిరిగి మామూలు మనిషి అవుతాడు," అని చెప్పాడు.

ఈ విషయం శాంతకు తెలిసింది. ఆమె భర్తను తట్టలో వుంచి, ఆ తట్టను తలపై పెట్టుకుని అతి కష్టం మీద అడుగులు వేస్తూ అరణ్యంలో ప్రవేశించింది. అయితే, ఆమె ఎంతో దూరం ముందుకు వెళ్ళలేక పోయింది. ఆమె తలమీది నుంచి తట్ట జారిపోతూంటే, తను ఒకపక్కకు పడిపోతూ, "భగవంతుడా! నేనే గనక పతివ్రతనైతే, నా భర్తకేమీ అపాయం కలగకూడదు," అనుకున్నది.

తర్వాత కాసేపటికి కళ్ళు తెరిచి చూస్తే శాంతకు భర్త పిలుపు వినిపించింది. భర్త క్షేమంగానే వున్నాడన్న తృప్తితో ఆమె లేచి నిలబడింది.



ధీరుడు ఆమెతో, "నాకు గొంతు ఎండిపో తున్నది. చెరుకు రసం తాగాలని వున్నది," అన్నాడు నీరసంగా.

శాంత చుట్టూ కలయ చూసి ఆశ్చర్య పోయింది. తను నేలమీద పడినప్పటి ప్రాంతం లాలేదది. దాపుల ఒక కొలను. కొలను పక్కనే మామిడి చెట్టు. ఇదే రాముని కొల నేమో! భగవంతుడు దయతలచి తమనక్కడికి చేర్చాడనుకున్నదామె.

ఆమె తట్టలో వున్న గొడ్డలి తీసుకుని మామిడి చెట్టు వంక చూసింది. దానికిబం గారు ఛాయలో వున్న ఫలాలు కనిపించాయి. కాలం కాని కాలంలో ఆ చెట్టుకు పళ్ళున్నం దుకు సంతోషిస్తూ ఆమె చెట్టును సమీపించి చేతి కందిన పండునొకదాన్ని కోసింది. వెం టనే ఆ పండు బంగారు పాత్రలా మారింది. అందులోని ద్రవం చిమ్మే సువాసనలనలను బట్టి, అది చెరుకు రసమని గుర్తించిం దామె.

శాంత బంగారు పాత్రలోని చెరుకురసాన్ని భర్తకిచ్చి తిరిగి గొడ్డలితో చెట్టును సమీపించ బోతూండగా, "ఆగు!" అన్న మాట కటువుగా వినిపించి అటుకేసి చూసింది.

ఎర్రటి పట్టుపంచ కట్టుకుని, మెడలో రుద్రాక్ష మాలతో, నొసట విభూదితో, తలపై పెద్ద జుట్టు ముడితో ముని ఒకడామెకు కని పించి, "ఒక ఫలవృక్షాన్ని నేల కూల్చడానికి ప్రయత్నిస్తున్నావు. ఎవరు నువ్వు?" అని మరింత కటువుగా ప్రశ్నించాడు.



మరుక్షణం శాంత చేతిలోని గొడ్డలి ఆమె చేతి పట్టును విడిపించుకుని, ఆమెకు అంద నంత ఎత్తున గాలిలోకి లేచింది. ముని పక పకా నవ్వాడు.

శాంత, మునిని సమీపించి ఆయన పాదా లకు నమస్కరించి, "నువ్వు తపస్వివైతే, నీలో శక్తి వుంటే నా భర్తను కరుణించు. అయనను మామూలు మనిషిని చెయ్యి. లేదా నా దారికి అడ్డు రాకు," అనికోరింది.

ముని గంభీరంగా ఆమె వంక చూసి, "నీ భర్త పాపి, తన పాపాలకు ఫలితం అను భవిస్తున్నాడు. అతణ్ణి నేనే కాదు, ఆ భగవం తుడు కూడా కాపాడ లేడు," అన్నాడు.

"నేనే కనుక పతివ్రతనైతే భగవంతుడు నాకు సహకరించుగాక!" అన్నది శాంత.

శాంత ఆయనకు తనను గురించి చెప్పు కున్నది. ముని అంతా ఆశ్చర్యంగా విని, "ఆ బైరాగి ఎవడో నిన్ను తప్పుదారి పట్టిం చాడు. వాడి మాటలు నమ్మి ఇంత దూరం రావడం నీ మూర్ఖత్వం. వచ్చినదారిన తిరిగి వెళ్ళు!" అన్నాడు.

"ఇంత దూరం వచ్చి ఇప్పుడు తిరిగి పోవడమా? నా ప్రయత్నం ఫలించాకే, నేని క్కడి నుంచి వెళతాను," అంటూ శాంత చెట్టును సమీపించి గొడ్డలిని ఎత్తింది.

"ఈ చెట్టుకింద తపస్సు చేసుకునే తపస్విని నేనే! నా తపోప్రభావం వల్లనే, ఈ చెట్టు వేళ్ళకు మహిమలు కలిగినై. నన్ను ధిక్కరించి నువ్వీ చెట్టును నరక లేవు," అన్నాడు ముని.

అంతే! విచిత్రంగా – అంతవరకూ గాలిలో తేలుతున్న గొడ్డలి, తనంతట తానుగా ఆ మామిడి చెట్టును నరకసాగింది. ముని దానిని ఆపాలని ఎన్నో మంత్రాలు చదివాడు. ప్రయో జనం లేకపోయింది.

కొద్ది సేపట్లో మామిడిచెట్టు నేల కూలింది. చెట్టు మొదలంటా పెళ్ళగించబడి వేళ్ళు బైటకు వచ్చాయి. శాంత ఒక వేరును తుంచి కొలను నీటిలో కడిగి భర్త చేత తినిపించింది. ధీరుడు వెంటనే మామూలు మనిషయి, తట్ట లోనుంచి బయటకు వచ్చాడు. ఆ భార్యా భర్త లిద్దరూ తపస్వికి నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఒక సామాన్య స్త్రీ ముందు తన తపశ్శక్తు లన్నీవృధా అయ్యాయన్న బాధతో, ముని వున్న చోటునే కుప్పలా కూలిపోయి శోకించసాగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తల్లిదండ్రుల మాటను లక్ష్య పెట్టక, దుర్వ్యసనాలకు బానిస అయి, ఫలితంగా రోగగ్రస్తుడై చావనున్న వాడికోసం, తన స్వార్థంకొద్దీ ఫలవృక్షాన్ని నరకబోయింది శాంత. ఇలాంటి స్వార్థం అనేది ఏమీ లేకుండా అరణ్యం చేరి, కేవలం మోక్షం కోసం తపస్సు చేసుకుంటున్నవాడు ముని. అలాంటి తపోధనుడి శక్తి, అత్యంత అల్పురాలైన శాంత ముందు ఏ కారణంవల్ల కొరగాకుండా పోయింది? దీన్ని విధి వక్రీకరణగా భావిస్తే సరిపోతుందా? లేక ఇందులో మానవ మేధస్సుకు అందని ఆముష్మిక చింతనా భావం ఏమైనా వున్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, ఈ క్షణమే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పతివ్రతల నెదిరించి ఆ భగవంతుడు కూడా నిలవలేడని పురాణాలు చెబుతున్నాయి. శాంతకు తన భర్త సుఖం కోరడంలో స్వార్థముండవచ్చు. కానీ, ఆమె స్వసుఖం కోసం కాక భర్త సుఖం కోసమే తన సర్వశక్తులనూ ఉపయోగించడం వల్ల మహిమాన్వితురాలైంది. కనిపించని దేవుణ్ణి కొలిచే వారికంటే, కనిపించే మనిషికి కష్టాల్లో సాయం చేసే వాళ్ళు ఎప్పుడూ గొప్ప వాళ్ళే. ఇక ముని మాటకు వస్తే — అతడికి భగవంతుడు అత్యంత ఉత్తమమైన మానవ జన్మనిచ్చాడు. దాన్ని అతడు కేవలం తన మోక్షం కోసం తపస్సు చేస్తూ స్వార్థపరుడయ్యాడు. అతడి వల్ల ఇతరులకు కలిగేమేలు ఆవగింజంతయినా లేదు. కనీసం తనకాశ్రయమిచ్చిన చెట్టునైనా తన తపోబలంతో తిరిగి బతికించాలన్న ఆలోచనకూడా అతడికి కలగలేదు. ఈ కారణాల వల్ల, జరిగినదానిని విధివక్రించడం అనడం పొరబాటవుతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



# పుణ్యాత్ముడు

హేలాపురి పెద్దవీధిలో ఒకడు, తలమీద పెద్ద గంపతో నడుస్తూ కాలికి రాయి తగిలి బోర్లా పడిపోయాడు. గంప కింద పడి, దానిలోని గాజు సామానంతా ముక్కలై పోయింది. జనం వాడి చుట్టూ మూగారు అయ్యోపాపం, అంటూ.

అంతలో ఒక వ్యక్తి ముందుకు వచ్చి, "గాజు సామానంతా పగిలిపోయిందే! యజమాని నీ జీతంలోంచి ఈ సామాను విలువంతా విరగ్గోస్తాడు కదా. మేమంతా ఒక వరహా ఇస్తాం. మళ్ళీ సామాను కొని పట్టుకుపో!" అంటూ ఒక వరహా గంపవాడి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

ఇది చూసి, అక్కడ మూగిన జనంలో కొందరు, ఆ నౌకరుకు తలా ఒక వరహా ఇచ్చారు. ఇలా చేరిన డబ్బుతో వాడు పక్కనే వున్న దుకాణంలో గాజుసామాను కొనేందుకు బయలుదేరుతూండగా, జనంలో వున్నవాడొకడు వాడితో, "ఇక నీకు నీ యజమాని వల్ల తిట్లూ, జీతంలో కోతా వుండవు. ఇంతకూ నీ యజమాని ఎవరు?" అన్నాడు.

దానికి నౌకరు, "ఆయనేనండి ఆ పుణ్యాత్ముడు – అందరికంటే ముందుగా ఎంతో బాధపడుతూ నా చేతిలో వరహా వుంచారే, ఆయనే నా యజమాని," అన్నాడు.

జనం తెల్లబోయారు.

– కోనే నాగవెంకట ఆంజనేయులు



చందమామ
అనుబంధం - 72

మనదేశపు చెట్లు

## అశోకవృక్షం




రావణుడు సీతను అపహరించుకుని పోయి, లంకానగరంలోని ఉద్యానవనం మధ్య ఉన్న ఒక అశోకవృక్షం కింద కాపలాలో ఉంచాడని రామాయణం చెబుతుంది. అశోకవృక్షం కిందే హనుమంతుడు సీతను కనుగొన్నాడు. అందుకే హిందువులు ఈ వృక్షాన్ని పవిత్రంగా భావిస్తారు.

గౌతమబుద్ధుడు లుంబినీ వనంలోని ఒక అశోక వృక్షం కింద తల్లి మాయాదేవి గర్భం నుంచి జన్మించాడని చెబుతారు. అశోక చక్రవర్తి ఆ వృక్షం నుంచి ఒక అంటుమొక్కను తీసి, శ్రీలంకలోని అనూరాధపురానికి పంపి, అక్కడ నాటించాడు. అది ఈనాటికీ సజీవంగా ఉన్నది. ఆవిధంగా బౌద్ధులు కూడా అశోకవృక్షాన్ని పవిత్రంగా భావిస్తారు.

తడిగా వున్న ప్రాంతాల్లో విరివిగా పెరిగే అశోక వృక్షాలను అలంకార వృక్షాలుగా పెంచుతారు. దాదాపు 10 మీటర్ల ఎత్తు పెరుగుతుంది. చిన్న చిన్న కొమ్మలతో ఆకులు గుబురుగా ఉంటాయి. ఎప్పుడూ పచ్చగా ఉండే దళసరి ఆకుల బరువు కారణంగా కొమ్మలు కిందికి వంగి ఉంటాయి. మధ్య కాండం మాత్రం నిటారుగా ఉంటుంది. గుత్తులు గుత్తులుగా పూచే చిన్న చిన్న పువ్వులు మొదట పసుపు రంగుతో ఉంటాయి. ఆ తరవాత నారింజ రంగుకు వచ్చి ఆఖరికి ఎర్రగా మారుతాయి.

అశోక పుష్పాలను పూజకు ఉపయోగిస్తారు. కొన్ని ఔషధాలు తయారుచేయడానికి కూడా వీటి ఆకులనూ, పువ్వులనూ ఉపయోగిస్తారు.




శిక్కు మత స్థాపకుడయిన గురునానక్ పైవిధంగా ప్రబోధించాడు.

"నువ్వు ఆశీర్వదించిన వారిని నేనూ ఆశీర్వదిస్తాను. నీ కరుణకు పాత్రులయినవారు, నా కరుణకు కూడా పాత్రులవుతారు. నేనే పరమదైవాన్ని. సర్వ సృష్టికర్తను! నువ్వు గురువు!" అని భగవంతుడు నానక్‌ను ఆశీర్వదించాడు.

గురునానక్ బోధనలను గురు అంగద్, గురు అమర్‌దాస్, గురు రాందాస్ అనే ఆయన శిష్యులు ప్రచారం చేశారు. వారి తరవాత వచ్చిన గురు అర్జున్ (1563 — 1606) తనకు పూర్వులయిన గురువుల సూక్తులను సేకరించి, తన రచనలనూ కలిపి ఒక సంకలనం తయారు చేశాడు. అదే శిక్కుల ప్రథమ మత గ్రంథమైన

## ఆదిగ్రంథ్

"దేవుడు ఒక్కడే!
అతడే పరమసత్యం!
అతడు సృష్టికర్త
భయ ద్వేష రహితుడు
సర్వాంతర్యామి
విశ్వవ్యాపకుడు
జనన మరణాలు లేని
అతని కరుణతో అతన్ని పూజించండి!
కాలానికి పూర్వమే
సత్యం ఉన్నది!
కాలం పయనించడం ప్రారంభించినప్పుడు
అతడే సత్యం!
ఇప్పుడుకూడా అతడే సత్యం,
ఎప్పటికీ సత్యమే నిత్యమైనది!"



'ఆదిగ్రంథ్' అయింది. ఆ గ్రంథాన్ని 1604వ సం॥లో అమృతసర్ లోని ఆలయంలో ఉంచారు.

'గ్రంథ్ సాహెబ్' అనబడే ఆ గ్రంథంలో కేవలం శిక్కు మత గురువుల బోధనలే కాకుండా, హిందువులకూ, జైనులకూ సంబంధించిన అనేక ఆధ్యాత్మిక సూక్తులు కూడా చోటు చేసుకున్నాయి. అందులోని కీర్తనలు భక్తి ప్రధానమైనవి. అందులో ఉన్నత తాత్విక సిద్ధాంతాలు కూడా ఉన్నప్పటికీ అవి అందరికీ అర్థమయ్యే సులభమైన భాషలో ఉన్నాయి.

శిక్కు మతం 15వ శతాబ్దంలో మన దేశంలో వున్న వివిధ మతాల నుంచి ప్రేరణ పొందడం వల్ల, విభిన్న మతాల అంశాలు అందులో ఉన్నాయి. శిక్కు మతస్థులే కాకుండా ఉత్తర భారత దేశంలో పలువురు హిందువులుకూడా 'గ్రంథ్ సాహెబ్'ను పవిత్రంగా భావించి, భక్తితో పఠిస్తారు. [ఆధారం : కుష్వంత్ సింగ్ 'శిక్కుల చరిత్ర']

'శిష్యుడు'అనే పదం నుంచి శిక్కు అనే పదం వచ్చింది. శిక్కు మతాన్ని పది మంది గురువులూ, వారి శిష్యులకూ సంబంధించిన మతం అని చెప్పవచ్చు. శిక్కు అంటే గురువు కోసం తన జీవితాన్ని అర్పించడానికి సిద్ధంగా ఉన్నవాడు 'అని అర్థం.

పది మంది గురువులు : గురునానక్ (1469 - 1539), గురు అంగద్ (1504 - 1552), గురు అమర్‌దాస్ (1479 - 1574), గురు రాందాస్ (1534 - 1581), గురు అర్జున్ దేవ్ (1563 - 1606), గురు హర్‌గోవింద్ (1595 - 1644), గురు హరిరాయ్ (1630 - 1661), గురు హరికృషన్ (1656 - 1664), గురుతేగ్ బహదూర్ (1621 - 1674) గురు గోవింద్ సింగ్ (1666 - 1708).

గురువు అనే మాట ఈ పది మందికి మాత్రమే వర్తిస్తుంది.

ప్రపంచ సృష్టిని గురించి గురునానక్ ఇలా అన్నాడు :

*"అతడు స్తంభాలు లేకుండా స్వర్గాన్ని నిలిపాడు*
*తన వాక్కుతో,*
*సూర్య చంద్రులను సృష్టించి,*
*తన కాంతిని వాటిలో నింపాడు,*
*నీకు తల్లీ తండ్రీ లేరు; నీకు జన్మనివ్వగల వారెవరు?*
*నీకు ఎటువంటి రూపమూ లేదు! జాతి భేదాలూ లేవు!"*

భగవంతుడు పంచభూతాల నుంచి ప్రపంచాన్ని సృష్టించాడని నానక్ అన్నాడు. అనంత విశ్వమే భగవంతుడి అద్భుత సృష్టి. అదే అతని అపార శక్తికి నిదర్శనం!

# మీకు తెలుసా?

1. విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన ఇద్దరు సోదరులు ఎవరు?
2. తాను నివసించిన నగరం తన పేరు మీదుగా పిలవబడాలని ఆశించిన సుప్రసిద్ధ రచయిత ఎవరు?
3. మనదేశంలో హిందీ తరవాత అధికసంఖ్యాకులు మాట్లాడే నాలుగు భాషలు ఏవి?
4. ఎక్కువ దూరం సముద్రం ఈదిన క్రీడాకారుడెవరు? ఎప్పుడు? ఎక్కడ?
5. ప్రాచీన సంస్కృత వ్యాకరణ కర్త ఎవరు? ఆయన రచించిన గ్రంథం ఏది?
6. సైకిలును కనుగొన్న వారెవరు? ఎప్పుడు కనుగొన్నారు?
7. 'దక్కనురాణి'గా ఏ నగరాన్ని చెబుతారు?
8. ఆధునిక 'సింగపూర్' రాజ్యస్థాపకుడు ఎవరు? ఎప్పుడు స్థాపించాడు?
9. 'బాంబే డక్'లోని వింత ఏమిటి?
10. జపాను పార్లమెంటు పేరేమిటి?
11. పెలె 20వ శతాబ్దంలో పేరుమోసిన ఫుట్‌బాల్ క్రీడాకారుడు. అయన సృష్టించిన రికార్డు ఎంత?
12. భూమి వైశాల్యం ఎంత?
13. చాలా బరువైన స్త్రీ ఎవరు? ఆమె బరువు ఎంత?
14. ప్రపంచంలో ఎక్కువ అగ్నిపర్వతాలు గల దేశం ఏది?
15. 'ఇంగ్లీష్ ఛానల్'ను ఇటీవల భారత దేశానికి చెందిన కుర్రవాళ్ళు ఈదారు. ఒక కుర్రవాడు నాలుగు ఛానల్స్‌ను ఐదు వారాలలో ఈదాడు. అతడు ఎవరు?
16. 'ఉదయసూర్యుడి భూమి' అని ప్రసిద్ధిగాంచిన దేశం ఏది?
17. నీళ్ళఅడుగున చాలా వేగంగా పరిగెత్తగల జంతువు ఏది?

## సమాధానాలు

1. హరిహరరాయలు, బుక్కరాయలు.
2. ఫ్రెంచి రచయిత విక్టర్ హ్యూగో.
3. తెలుగు, తమిళం, మరాఠీ, బెంగాలీ.
4. అమెరికాకు చెందిన బెన్సన్ హగ్గార్డ్. 1975వ సం॥లో.
5. పాణిని (క్రీ.పూ. 4 శతాబ్దం); అష్టాధ్యాయి.
6. కిర్క్ పాట్రిక్ మాక్మిలన్. 1839వ సం॥లో.
7. పూనే.
8. సర్ స్టాఫర్డ్ రాఫెల్స్, 1819వ సం॥లో.
9. అది పక్షి కాదు. ఒక చేప పేరు.
10. ది డియెట్
11. బ్రెజిల్‌కు చెందిన ఈ క్రీడాకారుడు 1956-1974 మధ్యకాలంలో 1,254 ఆటలలో పాల్గొని 1,216 గోల్స్ సాధించాడు.
12. 510, 100, 500 చదరపు కి.మీ.
13. అమెరికాకు చెందిన పెర్సీ పెర్ల్; 399 కి.గ్రా.
14. ఇండొనేషియా.
15. అమెరికాకు చెందిన ఫ్లొరెన్స్‌చాడ్విక్.
16. జపాను.
17. నీటిఏనుగు.



# తప్పులెన్నే బుద్ధి

దయానిధి అనే ఆయన మంచి పండితుడు. ఆయన పాండిత్యానికి మెచ్చి జమీందారు ఆయనకు పదెకరాల పొలమిచ్చాడు. దయానిధి ఆ పొలాన్ని గ్రామంలో వున్న చిన్న రైతు భూషయ్య చేత సాగు చేయిస్తున్నాడు. పండితుడన్న గౌరవం కొద్దీ భూషయ్య, దయానిధి పొలాన్ని శ్రద్ధగా సాగుచేయడమే కాక, ఇంటి పనులు కూడా క్రమం తప్పకుండా చేసి పెడుతూండేవాడు.

అయితే, దయానిధికి భూషయ్య పట్ల తృప్తి వుండేది కాదు. భూషయ్యను పనిలో నెమ్మది అనేవాడాయన. బుర్ర ఉపయోగించకుండా పనిచేయడం వల్ల, అనవసరంగా రెట్టింపు శ్రమపడతావనే వాడు. అనుభవం నుంచి నేర్చుకోడని దెబ్బలాడేవాడు. శుభ్రత తక్కువని చీటికి మాటికి చీదరించుకునేవాడు.

భూషయ్యకు దయానిధి అంటే ఎంతో గౌరవం. ఆయన మాటలపై గౌరవంకొద్దీ వాడు, ఆయన చెప్పినట్లు మారాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. పొద్దస్తమానం నెమ్మది, నెమ్మది అంటున్నాడని వాడు గబగబా పనులు చేయడం మొదలుపెడితే దయానిధి, "తొందరపనికిరాదనీ, నిదానమే ప్రధానమనీ పెద్దలు వూరికే చెప్పలేదు. అవతల ఆట గుర్రానికి అలంకరణ చెయ్యాలనా ఈతొందర!" అంటూ గట్టిగా మందలించాడు.

ఒకసారి దయానిధి వాడిని చేదతో నీళ్ళు తోడమన్నాడు. నీళ్ళు తోడి గుండిగ నింపాలంటే చేతులు పడిపోతాయి. బోలెడు సమయమూ వృథా అవుతుంది. ఇలా ఆలోచించి వాడు, గుండిగకు మోకు కట్టి గిలక మీది నుంచి జార్చి నూతిలోకి వదిలి, గుండిగను క్షణాల మీద నింపి బయటికి లాగేశాడు.

ఇదిచూసిన దయానిధి కంగారుగా బావి దగ్గిరకు వచ్చి, "అదేం పనిరా!" అని గొడవ చేశాడు.

శ్రీరామ కమల్

"మీరు పని చెప్పారు. నేను బుర్ర ఉప యోగించాను. క్షణాల మీద పని అయిపో యింది," అన్నాడు భూషయ్య.

"బుర్ర వున్నవాళ్ళు ఉపయోగించాలి; లేని వాళ్ళు కాదు. నేను చేదతో తోడమన్నానంటే వూరికే అన్నానా. నువ్వు చేసిన పనివల్ల బరువుకు ఆగలేక మోకుతాడు తెగిపోవచ్చు. అంతెందుకు? గిలక వంగిపోవచ్చు. నీచేతి ఎముకలు విరిగినా విరిగిపోవచ్చు. అందుకే చేదతో తోడమన్నాను. ఇంకెన్నడూ నన్నడగకుండా ఇలాంటి పనులు చెయ్యకు," అంటూ దెబ్బలాడాడు దయానిధి.

"అయ్యా! నేను తమకు పొరపాటు చెప్పాను. నిజానికి నేను నా బుర్ర ఉపయోగించలేదు. ఎన్నో ఏళ్ళుగా నేను తోడుకుంటున్నాను. ఏ ప్రమాదమూ లేదు. ఆ అనుభవాన్ని ఉపయోగించి ఇప్పుడు శ్రమ తగ్గించుకుంటున్నాను," అంటూ భూషయ్య సర్ది చెప్పాలని చూశాడు.

అయితే దయానిధి మండిపడుతూ, "జ్ఞానం, పాండిత్యం లేనిచోట అనుభవం రాణించదు! ఏ కొండమీదో వుండగా నిన్నొక క్రూర జంతువు తరిమిందనుకో. క్షణాల మీద ఎంత ఎత్తయినా దూకేసి పారిపోయి ప్రాణాలు రక్షించుకుంటావు. ఆ అనుభవంతో మళ్ళీకొండమీంచి దూకాలనుకుంటే ప్రాణాలు పోతాయి. నీకు శరీర శాస్త్రం గురించి తెలియదు. భౌతికశాస్త్రం తెలియదు. అందువల్లే ఇంతకాలం అలా పనిచేశావు. అదృష్టమో, నావంటివారి ఆశీర్వాదబలమో నిన్ను కాపా



డింది. ఇకమీదట ఇలాంటి పనులు చేయకు," అని హెచ్చరించాడు.

శుభ్రం తక్కువని చీదరించుకుంటున్నాడని, ఒకరోజున భూషయ్య శుభ్రంగా స్నానం చేసి, మల్లెపువ్వుల్లాంటి బట్టలు కట్టుకుని, ఒంటికి మంచి అత్తరు పూసుకుని దయానిధి ఇంటికి వెళ్ళాడు.

దయానిధి వాణ్ణి చూస్తూనే, "ఏరా! పెరటి దొడ్లో పనిచేయడానికి వచ్చావా? నాతో పంక్తి భోజనం చేయాలనుకుంటున్నావా?" అని కోప్పడ్డాడు.

"మీరు చిరాకు పడుతున్నారని శుభ్రంగా స్నానం చేసి, మంచి బట్టలు కట్టుకుని వచ్చాను, బాబూ!" అన్నాడు భూషయ్య వినయంగా.

"అదేం కాదు! ఇంత శుభ్రంగా వస్తే నిన్ను చూసి ఏ పనీ చెప్పలేనని, ఇలా తయారై వచ్చావు. అత్తరు వాసనలతో ఘుమఘుమలాడే వాడి చేత చెమటలు చిందించే పని ఎలా చేయిస్తాను? నీకిష్టం లేకపోతే నేనేమైనా బలవంత పెడుతున్నానా? నీ మనసులోని మాట నోటితో చెబితే సరిపోతుంది కదా -- ఇలా డొంక తిరుగుడు వేషాలెందుకు? వెళ్ళు వెళ్ళు.... నా పనులు నేనే చేసుకుంటానులే!" అంటూ నిష్ఠూరంగా మాట్లాడాడు దయానిధి.

భూషయ్య ఇందుకు ఎంతో నొచ్చుకుని, ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చి, ఆయన చెప్పిన పనులన్నీ చేసి వెళ్ళాడు.

దయానిధి ఎన్ని మాటలన్నా భూషయ్యకు కోపం రాదు. వాడింకా చాలామంది పొలాలు





సాగుచేస్తూ, చేయిస్తూ వున్నాడు. ఏదో సమయంలో అందరి చేతా మాటలు పడుతూనే వుంటాడు. అన్యాయంగా ఎవరైనా తనను మాటలంటే వాడు ఎదురు సమాధానాలు చెబుతూంటాడు. కానీ దయానిధి పండితుడని వాడికి గౌరవం.

భూషయ్యకు చంద్రయ్య అనే కొడుకున్నాడు. వాడు చాలా తెలివైనవాడు. తండ్రిలాగా వ్యవసాయం చేయడం వాడికిష్టంలేక, చిన్నప్పటినుంచీ చదువు మీద శ్రద్ధ చూపించేవాడు. వాడికి చదువు బాగా ఒంటపడుతున్నది.

తనకొడుకును దయానిధికి శిష్యుణ్ణి చేయాలని భూషయ్య కోరిక. అయితే చంద్రయ్య మాత్రం, తన చదువు కోసం పొరుగూరు పండితుల వద్దకు కూడా వెళుతూంటాడు తప్ప, ఎక్కువగా దయానిధిని ఆశ్రయించడు. ఎప్పుడైనా ఆయన వద్దకు వెళ్ళి తన విద్యను పరీక్షించుకుంటూంటాడు.

"నువ్వు చాలా తెలివైన వాడివి. పూర్తిగా నా శిష్యుడిగా వుండిపో. నిన్ను నా అంతవాణ్ణి చేస్తాను," అన్నాడు దయానిధి ఒకసారి చంద్రయ్యతో.

దానికి చంద్రయ్య, "అయ్యా! తమరు మహాపండితులు. సూర్యుడి వేడి సోకి హనుమంతుడంతటివాడు తట్టుకోలేక మూర్ఛపోయాడు. మీ ముందు నేను నిలువలేను. అందుకే ఇతరుల వద్ద విద్య నేర్చుకుంటున్నాను. ఒక స్థాయికి వచ్చాక మీ వద్దనే శిష్యుడిగా చేరతాను," అని వినయంగా దయానిధికి బదులిచ్చాడు.

కలుసుకున్నప్పుడల్లా చంద్రయ్య, దయానిధిని అదే పనిగా పొగుడుతూండడంవల్ల ఆయనకు వాడంటే ఇష్టంగానే వుండేది. భూషయ్య తరచుగా ఆయనను తనకొడుకు చదువు గురించి అడుగుతూండేవాడు.

"మీ వాడికి చదువు బాగా వస్తుంది. కానీ వాడికి మర్యాద తెలియదు. నన్ను చూడవచ్చినప్పుడల్లా నాకు నమస్కారం చేయాలని వాడికి తోచడం లేదు," అన్నాడు దయానిధి.

"అయ్యా! తమరు పెద్దలు, మర్యాద తెలియకపోతే వాడికి తమరే నేర్పాలి," అన్నాడు భూషయ్య.

"పండితులు అడిగి నమస్కారం పెట్టించుకోరు. పెద్దలను కలిసినప్పుడు నమస్కారం పెట్టి పలకరించాలని వాడికి చాలా సార్లు చెప్పాను. అవునని ఒప్పుకుంటాడే తప్ప, నాకు నమస్కారం పెట్టడే! నాకు నమస్కారం చెయ్యరా అని నోరు విడిచి అడగలేనుగదా?" అన్నాడు దయానిధి బాధగా.

భూషయ్య ఆ రాత్రి ఇంటి దగ్గర కొడుకును పలకరించి, "దయానిధి బాబుకు నువ్వు దణ్ణం పెట్టవటగదా?" అన్నాడు.

చంద్రయ్య నవ్వి వూరుకున్నాడు.

"తప్పు! ఇక మీదట అలా చేయకు. నీ తప్పు దిద్దుకో," అన్నాడు భూషయ్య కొడుకును మందలిస్తూ.

అందుకు చంద్రయ్య, "నేను చదువుకున్న వాణ్ణి కాబట్టి దయానిధి బాబు నన్నేమీ అనడు. నేనాయన్ను పొగుడుతాను కాబట్టి నేనంటే ఆయనకిష్టమే! ఆయనకు దణ్ణం పెట్టలేదనుకో – ఆ తప్పు గురించి నీ దగ్గర చెబుతాడే తప్ప నా దగ్గర అనడు," అని వూరుకున్నాడు.

"అయితే మాత్రం – ఆయనకు దణ్ణం పెట్టనంటావా? అదితప్పు," అన్నాడు భూషయ్య.

"నిజమే – అది తప్పే! ఆ తప్పు చేస్తున్నంత కాలం ఆయన నా మిగతా తప్పుల జోలికి రాడు! దయానిధిబాబుది తప్పులెన్నేబుద్ధి! నా చదువు గురించి లేనిపోని తప్పులెన్ని, నీ దగ్గర చెబుతూంటే, ఆ మాటలు విని నేను ఎంతో కొంత నిరుత్సాహపడిపోతాను. చదువుకునే వాడికి ప్రోత్సాహం అవసరం. చీటికీ మాటికీ తప్పులెన్నుతూంటే శిష్యులు నీళ్ళుగారిపోతారు. అందుకే ఆయన దృష్టి ఇతర తప్పుల మీదికి పోకుండా, ఒకే ఒక తప్పు చేస్తున్నాను! నా క్షేమం కోరేవాడివైతే, ఆయనకు దణ్ణం పెట్టమని నన్ను బలవంత పెట్టకు," అన్నాడు చంద్రయ్య.

దానితో భూషయ్యకు విషయం అర్థమయింది. వాడు కొడుకు తెలివికి ఎంతో సంతోషించాడు. తప్పులెన్నేబుద్ధి చదువుకున్న వాడి దణ్ణానికి అర్హంకాదని కూడా భావించి, వాడు కొడుకునిక ఆ విషయంలో ఎప్పుడూ బలవంత పెట్టలేదు.





# లాభసాటి కోపం

వల్లభాపురంలో పరశురామయ్య అనే పెద్ద భూస్వామి వుండేవాడు. రూపంలోనూ, మితి మించిన కోపంలోనూ ఆయన పేరుకు తగ్గ మనిషి. ప్రతి చిన్న విషయానికీ, కోపంతో అగ్గిమీద గుగ్గిలంలా మండిపడడం ఆయ నకు అలవాటు.

ఒకనాడు ఆయన మిత్రుడు ముకుందయ్య, ఆయనను చూడవచ్చాడు. ముకుందయ్య గుర్రపు బండి దిగి, ఐదురూపాయలు కిరాయి నిమిత్తం బండివాడికిచ్చాడు. బండివాడు ఆ డబ్బును రొండిన దోపుకుని, గుర్రాన్ని అది లించి తిరిగి అక్కడినుంచి పట్నంకేసి వెళ్ళ బోతున్నాడు.

ఆ సమయంలో, తన మిత్రుడు ముకుం దయ్యకు ఆహ్వానం చెప్పవచ్చిన పరశురామ య్యకు, ఐదు రూపాయలు రొండిన దోపు కుని వెళ్ళబోతున్న బండివాడిని చూస్తూనే, తాడి ఎత్తున కోపం వచ్చింది.

ఆయన బండివాడిని అడ్డగించి, "ఏరా! పట్టణం నుంచి ఇక్కడికి బాడుగ ఐదు రూపా యలా? మేం ఎవరం ఏనాడూ రెండు రూపాయ లకు మించి ఇచ్చింది లేదు. కొత్తవారని కని పెట్టి, ఆయన నుంచి అధికంగా బాడుగ గుంజుతున్నావా? మర్యాదగా మూడు రూపా యలు తిరిగి ఇవ్వు," అంటూ గర్జించాడు ఆవేశంతో.

బండివాడు ఒక్క క్షణం అదిరిపడి, "అయ్యా! ఈయన గారు ఒకరిద్దరు బండి వాళ్ళతో బేరమాడిన తర్వాతే, నా బండిని ఐదు రూపాయలకు కుదుర్చుకున్నారు," అన్నాడు వినయంగా.

"అదా సంగతి! మీ బండి వాళ్ళందరూ కూడబలుక్కుని బాడుగ పెంచేశారన్న మాట. ఏమైనా, నా దగ్గిర మాత్రం నీ ఆటలు సాగవు తెలుసుకో," అంటూ పరశురామయ్య, బండి వాడి మీదికి లంఘించి, రొండిన వున్న

వారణాశి శ్రీరామకృష్ణ

ఐదు రూపాయలూ దొరకపుచ్చుకుని, వాటిలో రెండు రూపాయలు తీసి వాడి మీదికి విసిరి వేశాడు.

బండివాడు వినయంగా, "అయ్యా! తమ వంటి పెద్దవారికి ఇది తగిన పని కాదు," అన్నాడు.

దానితో పరశురామయ్య కోపం తారాస్థాయికి చేరుకుంది. ఆయన తీవ్ర స్వరంతో, "ఏరా, నా అంతటివాడికే ఏది తగునో, ఏది తగదో చెప్పగలంతటి గొప్పవాడిననుకుంటున్నావా? నువ్వు మళ్ళీ నోరెత్తావో, ఈ క్షణమే నా వేటకుక్కల్ని ఉసిగొల్పి నిన్నూ, నీ గుర్రాన్నీ ఊరి పొలిమేరల దాకా తరిమిస్తాను. తక్షణం పారిపోయి నీ ప్రాణాలనూ, గుర్రాన్నీ, బండినీ కాపాడుకో," అంటూ హెచ్చరించాడు.

అంత కోపంలో పరశురామయ్య, అన్నంత పనీ చేయగలడని బండివాడు గ్రహించాడు. కుక్కలు తననూ గుర్రాన్నీ వెంటబడి తరిమితే జరిగే ప్రమాదాన్ని మనసులో ఊహించుకుంటూనే, వాడు గుర్రాన్ని అదిలించి వాయువేగంతో అక్కడినుంచి పారిపోయాడు.

అప్పటి వరకూ, అంతా ప్రేక్షకుడిలా చూస్తున్న ముకుందయ్య తేరుకుని, పరశురామయ్యతో, "పరశురాం! నీ కోపం నానాటికీ శృతిమించిపోతున్నట్టు తోస్తున్నది. అతి స్వల్ప విషయానికి ఎంత రచ్చ చేశావు! తన కోపమే తన శత్రువు, అన్నారు పెద్దలు. ఆ మాటలోని సత్యం గ్రహించి నీ కోపాన్ని తగ్గించుకునే ప్రయత్నం చెయ్యి," అన్నాడు హితవు చెపుతున్నట్టు.



దానికి పరశురామయ్య నవ్వి, "ఈపాటి నాకు తెలియదనుకున్నావా, ముకుందం? నువ్వనే ఆ పెద్దలే, 'పేదవాడి కోపం పెదవికి చేటు;' అని కూడా అన్నారు. అంటే — కోపం ధనవంతుడికి ఏమీ నష్టం కలిగించదని అర్థం గదా! అనేక సమయాల్లో కోపం మనకు లాభం కలిగిస్తుంది. ఇప్పుడు జరిగింది చూశావు గదా! నా కోపానికి బండివాడు తారెత్తి పారిపోయాడు. మనకు మూడు రూపాయలు లాభం. నా నిత్య జీవితంలో కూడా ఇంతే. నా కోపానికి భయపడి కూలివాళ్ళు, పాలెగాళ్ళు ఎంత పని చెప్పినా, ఎంత డబ్బు ఇచ్చినా, ఇదేమిటని ప్రశ్నించరు నన్ను. దీనివల్ల మనకు ఎంత లాభమో ఆలోచించు? ఉన్నవాడి కోపం లేనివాడిపై అద్భుతంగా పనిచేస్తుంది. ఇది నేను అనుభవంలో చూశాను. అందువల్లనే నేను కోపం తగ్గించుకోకపోగా, ఒక్కొక్కసారి అతిగా నటన కూడా చేస్తూంటాను," అని ఏదో గుర్తుకు వచ్చినవాడిలా కిందికి వంగి, "ఇదుగో చూశావా, ముకుందం, నే నన్నదానికి సాక్ష్యం! నా కోపానికి హడలిపోయిన బండివాడు, తనకు రావలసిన రెండు రూపాయలు కూడా తీసుకోకుండా మరిచి వెళ్ళిపోయాడు. మనకు ఐదు రూపాయలు మిగులే!" అంటూ కింద పడివున్న రెండు రూపాయలను తీసుకున్నాడు.

"నువ్వన్న దాంట్లోనూ, ఏదో రవ్వంత నిజం వున్నట్టు కనబడుతున్నది," అంటూ ముకుందం కొంతసేపు ఏదో ఆలోచిస్తూ, ఉలిక్కిపడి, "పరశురాం! నీ కోపానికి హడలిపోయిన బండివాడు తన బాడుగ డబ్బులు తీసుకోవడం మరిచాడు. నేను వాడి బండిలో పెట్టిన చేతిసంచీ మరిచిపోయాను. అందులో నువ్వు తెమ్మని చెప్పిన బంగారు నగలున్నవి! మొత్తం మీద నీ కోపం, నీకూ బండివాడికూడా లాభించింది. నిజంగానే నీది లాభసాటి కోపం!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే పరశురామయ్య నివ్వెరపోయాడు. ఆనాటి నుంచీ ఆయన, చీటికి మాటికి ఆవేశపడకుండా తన కోపాన్ని అదుపులో వుంచుకునేందుకు గట్టి ప్రయత్నాలు ప్రారంభించాడు.






భీష్ముడి మాటలకు సత్యవతి సిగ్గుపడుతూ తాను పడవ నడిపే రోజులలో పరాశర మహర్షికి కృష్ణద్వైపాయనుణ్ణి కన్న వృత్తాంతం చెప్పి, "అతను నా కొడుకు. గొప్ప తపస్సు చేసినవాడు. వేదాలను విభజించినవాడు. అతని ద్వారా భరతవంశాన్ని నిలబెట్టుదాం," అన్నది.

అందుకు భీష్ముడు సమ్మతించాడు. సత్యవతి తలుచుకోగానే కృష్ణద్వైపాయనుడనే వ్యాసుడు వచ్చి, "అమ్మా, నన్నెందుకు తలుచుకున్నావు?" అని అడిగాడు. సత్యవతి ఆయనకు తన ఉద్దేశం చెప్పింది. వ్యాసుడు సమ్మతించాడు.

తరవాత సత్యవతి అంబికను ఆ రాత్రి అలంకరించుకుని పడుకోమని, ఆమె వద్దకు ఆమె "బావ" వస్తాడనీ, అతనికి సంతానం కని వంశం నిలబెట్టమనీ చెప్పింది. "బావ" అంటే భీష్ముడే కాబోలునని అంబిక అనుకున్నది. కాని, ఆ రాత్రి ఆమె గదిలోకి వ్యాసుడు వచ్చాడు. వ్యాసుడి తెల్లని గడ్డమూ, నల్లని ఆకారమూ, ఎర్రని కళ్ళూ చూసి అంబిక భయపడి కళ్ళు గట్టిగా మూసుకున్నది. ఆమె వ్యాసుణ్ణి అంతకు పూర్వం ఎన్నడూ చూసి ఉండలేదు. ఆమె భయంతో రెండు కళ్ళు మూసుకున్న దోషం చేత ఆమెకు పుట్టిన ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి అయ్యాడు.

ఇది చూసి సత్యవతి హతాశురాలయింది. కొంతసేపు ఆలోచించి ఆమె మళ్ళీ వ్యాసుణ్ణి తలుచుకున్నది. వెంటనే వ్యాసుడు అక్కడికి వచ్చాడు.



ఈసారి ఆమె అంబాలికతో, "ఈ రాత్రి నీ వద్దకు ఒక ముని వస్తాడు. అతని ద్వారా ఒక ఉత్తముడైన కొడుకును కని వంశం నిలబెట్టు," అన్నది.

ఆ రాత్రి అంబాలిక వ్యాసుడి అవతారం చూసి, కళ్ళు మూసుకోలేదు గాని, వెలవెల పోయింది. దాని ఫలితంగా తెల్లని శరీరంతో పాండుడు పుట్టాడు.

సత్యవతికి తృప్తి కలగలేదు. ఆమె మరొక సారి అంబికను హెచ్చరిస్తూ, "ఈసారయినా మునికి తగిన కొడుకును కను," అన్నది.

కాని అంబిక వ్యాసుణ్ణి తలుచుకుంటే కంపరం పుట్టుకొచ్చి, ఆమె ఆ రాత్రి తన దాసీని తన పడక గదిలో ఉంచింది.

ఆ దాసీదానికి వ్యాసుడి వల్ల విదురుడు పుట్టాడు.

ఆ విధంగా పుట్టిన ధృతరాష్ట్రుడూ, పాండుడూ, విదురుడూ పెరిగి పెద్దవారవుతూంటే భీష్ముడు రాజ్యభారం వహించి, దేశం సుభిక్షంగానూ, ప్రజలు సుఖ శాంతులు కలిగి ఉండేటట్టూ రాజ్యపాలన చేశాడు. భీష్ముడు వారికి క్షత్రియోచిత విద్యలూ, వేద వేదాంగాలూ, నీతిశాస్త్రాలూ నేర్పించాడు.

వారిలో ధృతరాష్ట్రుడు అమిత బలశాలి, పాండుడు ధనుర్విద్యలో ప్రవీణుడు, విదురుడు ధర్మపరుడు.

కాలక్రమాన భీష్ముడు ఆ ముగ్గురిలోనూ ఒకరికి రాజ్యాభిషేకం చెయ్యవలసి వచ్చింది. ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి. విదురుడు దాసీ పుత్రుడు. అందుచేత వారిద్దరికీ కాక పాండుడికి భీష్ముడు రాజ్యాభిషేకం చేశాడు.

కురువాళ్ళకు వివాహయోగ్యమైన వయసు వచ్చింది. వాళ్ళకు తగిన కన్యలు ఎక్కడ ఉన్నారా అని భీష్ముడు ఆలోచించాడు. గాంధార రాజైన సుబలుడికి గాంధారి అనే కూతురున్నది. ఆమె తనకు నూరుగురు కొడుకులు కలిగేటట్టుగా శివుడి వల్ల వరం పొందినట్టు తెలిసింది.

భీష్ముడు కొందరు బ్రాహ్మణులనుగాంధార రాజు సుబలుడి దగ్గరికి పంపి, గాంధారిని ధృతరాష్ట్రుడికిచ్చి వివాహం చెయ్యమని అడిగించాడు.

ధృతరాష్ట్రుడు గుడ్డివాడని తెలిసి కూడా అతని వంశం గొప్పదనుకుని సుబలుడు ఒప్పుకున్నాడు.

తనకు కానున్న భర్త గుడ్డివాడని తెలియ గానే గాంధారి తన కళ్ళకు గంతలు కట్టేసు కుని, తాను కూడా గుడ్డిదిగా ఉండిపోవ డానికి నిశ్చయించింది. ఆమె అన్న శకుని ఆమెను హస్తినాపురానికి తీసుకువచ్చి పెళ్ళి జరిపించాడు. తరవాత శకుని భీష్ముడిచ్చిన సత్కారాలన్నీ పొంది, గాంధారిని హస్తినా పురంలో వదిలి, తాను స్వదేశానికి తిరిగి పోయాడు.

ఇక పాండురాజుకు వివాహం కావలసి ఉన్నది. భీష్ముడికి కుంతి అనే యాదవ కన్య గురించి తెలియ వచ్చింది.

యాదవ ప్రముఖులలో ఒకడైన శూరు డనేవాడు వసుదేవుడి తండ్రి. ఆయనకు పృథ అనే కూతురున్నది.

శూరుడి మేనత్త కొడుకు కుంతిభోజుడనే వాడికి పిల్లలు లేకపోగా అతను ఈ పృథను తన కూతురుగా పెంచుకున్నాడు. కుంతి భోజుడి ఇంటికి వచ్చేపోయేవారి కందరికీ పృథ అతిథి సత్కారాలు చేస్తూ ఉండేది. అలాగే ఒకసారి దూర్వాసుడు వచ్చి, ఆమె చేసిన సత్కారాలకు ఎంతో సంతోషించి, ఆమెకు ఒక మంత్రం చెప్పి, "అమ్మాయీ, ఈ మంత్రాన్ని పునశ్చరణ చేసి జపించావంటే, నువ్వు ఏ దేవుణ్ణి కోరితే, ఆ దేవుడు వచ్చి నీకు ఒక గొప్ప కొడుకును ప్రసాదిస్తాడు," అని చెప్పాడు.





ముని మాట నిజమో కాదో చూతామని కుంతి ఒకనాడు సూర్యుణ్ణి మనసులో పెట్టుకుని ఆ మంత్రం జపించింది. వెంటనే సూర్యుడు ఆమె ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఆమె కొడుకును కోరలేదు. అయినా, సూర్యుడి వల్ల గర్భవతి కావటం తప్పలేదు. సకాలంలో ఆమెకు కవచ కుండలాలు గల కొడుకు పుట్టాడు. ఏం చెయ్యాలో తెలియక వాణ్ణి ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను ఒక తెప్పకు కట్టి నదీ ప్రవాహంలో వదిలింది.

అది ఒక సూతుడికి దొరికింది. సూతుడు ఆ పెట్టెలో చిన్న సూర్యుడిలాటి పిల్లవాడుండటం గమనించి, పరమానందంతో ఆ పిల్లవాణ్ణి తన భార్య అయిన రాధ అనే ఆమెకిచ్చాడు. ఆమె కుర్రవాణ్ణి పెంచింది. అతడే కర్ణుడు.

ఇది జరిగాక కుంతిభోజుడు తన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. దానికి పాండుడు కూడా వెళ్ళాడు. కురువంశంలో పుట్టి, ఎంతో అందంగానూ, వైభవోపేతుడుగానూ కనిపించిన పాండుడి మెడలో కుంతి వరమాల వేసింది. కుంతిభోజుడా ఇద్దరికీ ఘనంగా పెళ్ళిచేసి, అంతులేని కానుకలతో హస్తినాపురానికి పంపాడు. కుంతి కోసం ఒక ప్రత్యేకమైన అంతఃపురం ఏర్పాటయింది. అందులో కుంతీ పాండులు సమస్త సుఖాలూ అనుభవించసాగారు.

పాండుడికి మరొక భార్యను కూడా పెళ్ళి చేయాలని భీష్ముడు నిశ్చయించాడు. మద్ర రాజైన శల్యుడికి ఒక చెల్లెలున్నది. భీష్ముడు పెద్ద పరివారంతో శల్యుడి రాజధానికి బయలుదేరి వెళ్ళాడు.

శల్యుడు భీష్ముడికి ఎదురువచ్చి, స్వాగతం తెలిపి తీసుకుపోయి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నీ చెల్లెలు మాద్రిని మా పాండురాజుకిచ్చి పెళ్ళి చెయ్యి," అని అడిగాడు భీష్ముడు.

"అంతకంటే నాకైనా కావలసినదేమున్నది? అయితే కన్యాశుల్కం పుచ్చుకోవటం మా వంశాచారం. కన్యాశుల్కం ఇచ్చి మా చెల్లెలిని తీసుకుపోయి, మీ ఇంట వివాహం



చేసుకోండి," అన్నాడు శల్యుడు చాలా సంతోషంగా.

వంశాచారాలను పాటించక తప్పదు గనక భీష్ముడు మద్రరాజుకు బంగారమూ, రత్నాభరణాలూ, వస్త్ర వాహనాలూ పుష్కలంగా ఇచ్చి, మాద్రిని హస్తినాపురానికి తెచ్చి, ఒక శుభముహూర్తాన పాండురాజు కిచ్చి వివాహం చేశాడు. పాండురాజు తన ఇద్దరు భార్యలతోనూ సుఖంగా కాలం గడపసాగాడు.

భార్యలతో ఒక నెల పాటు సుఖంగా గడిపిన తరవాత పాండురాజుకు దిగ్విజయం చెయ్యాలన్న కోరిక కలిగింది. అతను చతురంగ బలాలను సమకూర్చుకుని, ప్రయాణ భేరి మోగించి, భీష్ముడు మొదలైన వారికీ, బ్రాహ్మణులకూ మొక్కి మొదటగా దశార్ణ దేశాలను జయించాడు. తరవాత మగధ దేశం మీద దండెత్తి, మగధరాజును చంపాడు. మగధ, కాశీ, పుండ్ర మొదలైన దేశాలు జయించి, అంతులేని కానుకలనూ, కప్పాలనూ పుచ్చుకుని తిరిగి వచ్చాడు.

భీష్ముడు మొదలైన పెద్దలు పాండుడి ఎదురువచ్చి గొప్పగా సన్మానించారు. పాండురాజు తాను వివిధ దేశాలలో కొల్లగొట్టిన సంపదను భీష్ముడికీ, సత్యవతికీ, విదురుడికీ, తమ తల్లులకూ పంచాడు. అందరూ ఎంతగానో సంతోషించారు. ఆ ధనంతోనే ధృతరాష్ట్రుడు అనేక అశ్వమేధాలు చేశాడు.

తరవాత పాండురాజు తన ఇద్దరు భార్యలనూ వెంటబెట్టుకుని విహారం చెయ్యటానికి హిమవత్ప్రాంతంలోని అరణ్యాలకు వెళ్ళాడు. అతనికి అవసరమైన వస్తువులను ధృతరాష్ట్రుడు పంపుతూ వచ్చాడు.

అక్కడ హస్తినాపురంలో భీష్ముడు విదురుడికి దేవకుడనే రాజు కుమార్తెనిచ్చి పెళ్ళి చేశాడు.

ఒకనాడు ధృతరాష్ట్రుడి ఇంటికి వ్యాసుడు చాలా ఆకలితో వచ్చాడు. గాంధారి ఆయనకు సకలోపచారాలు చేసి సంతోషపెట్టింది. వ్యాసుడామెను వరమేదన్నా కోరుకోమన్నాడు. గాంధారి తన భర్తకు తీసిపోని కొడుకులను నూరుమందిని కోరింది. తరవాత కొంత కాలానికి గాంధారి గర్భవతి అయింది. ఆమె

రెండేళ్ళపాటు గర్భాన్ని మోసింది. ఈలోపుగానే కుంతికి యుధిష్ఠిరుడు పుట్టినట్టు వార్త వచ్చింది. వ్యాసుడు వరమిచ్చినా కూడా తన కింకా ప్రసవం కాలేదని బాధపడి, గాంధారి తన భర్తతోనైనా సంప్రతించకుండా, తన గర్భాన్ని గట్టిగా కొట్టుకున్నది. రెండేళ్ళు కష్ట పడి మోసిన ఆ పిండం తాలూకు ఖండాలను ఆమె పారేద్దామనుకున్నది.

ధృతరాష్ట్రుణ్ణి చూడవచ్చిన వ్యాసుడి కీసంగతి తెలిసింది.

"ఏమిటి నువ్వు చేస్తున్న పని?" అని ఆయన గాంధారి నడిగాడు.

గాంధారి ఏడుస్తూ, "మీరు నాకు నూరు గురు కొడుకులు కలిగేటట్టు వరమిచ్చారు. నేను రెండేళ్ళు గర్భవతిగా ఉండి కూడా పిల్లలను కనలేదు. ఇంతలో పాండురాజు భార్య అయిన కుంతికి చక్కని కొడుకు పుట్టినట్లు తెలిసింది. ఆ విచారంతో నా పొట్టను నేనే కొట్టుకుని గర్భస్రావం చేసు కున్నాను. మీ వరం మాట ఏమోగాని ఈ గర్భం ఇలా ముక్కలు చెక్కలయింది," అన్నది.

"నా వరం ఎన్నటికీ వ్యర్థం కాదు," అంటూ వ్యాసుడు, గాంధారీ గర్భం నుంచి పడిన మాంసఖండాలను నూరింటినీ చక్కగా చన్నీట కడిగించి, ఒక్కొక్క ఖండాన్నీ ఒక్కొక్క నేతికుండలో పెట్టించసాగాడు.

అప్పుడు గాంధారి ఆయనతో, "ఈ నూరు ఖండాలూ నూరుగురు పిల్లలవుతారు కాబోలు, వారితోబాటు ఒక ఆడపిల్ల కూడా



కలిగేటట్టు అనుగ్రహించండి. దౌహిత్రుల వల్ల కూడా పుణ్యలోకాలు కలుగుతాయి," అన్నది.

ఆమె కోరిక సిద్ధించాలని వ్యాసుడు దీవించాడు. స్రావమైన గర్భాన్ని నూట ఒక్క ముక్కలు చేసి కుండలలో పెట్టించి వ్యాసుడు వెళ్ళిపోయాడు.

తరవాత ఒక్క సంవత్సరం గడిచేసరికి ఒక కుండ నుంచి మొదటి పిల్లవాడు పుట్టాడు. వాడు పుట్టగానే అనేక దుశ్శకునాలు కనబడ్డాయి.

వాటిని చూసి ధృతరాష్ట్రుడు ఎంతగానో భయపడిపోయి, భీష్ముణ్ణీ, విదురుణ్ణీ, మంత్రులనూ, ఆస్థాన పురోహితులనూ పిలిపించి, "ఇదివరకే మా వంశంలో యుధిష్ఠిరుడు పుట్టాడు గదా, ఇప్పుడు పుట్టినవాడికి రాజ్యార్హత ఉంటుందా? కొంచెం ఆలోచించి చెప్పండి," అని అడిగాడు.

దానికి వాళ్ళు, "మహారాజా, వీడు పుట్టగానే దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. వీడు వంశ నాశకుడు. వీణ్ణి వదిలెయ్యి: నూరు మంది కొడుకులలో ఒకడు లేకపోతేనేం?" అని అన్నారు.

విదురుడు కూడా నెమ్మదిగా ఆలోచించి, ఆ మాటే చెప్పాడు. కాని పుత్రప్రేమ కొద్దీ ధృతరాష్ట్రుడు వాళ్ళ మాటలు వినిపించుకో లేదు.

ఆ విధంగా మొట్టమొదట దుర్యోధనుడు పుట్టాడు. తరవాత కుండల నుంచి క్రమంగా దుశ్శాసనుడూ, దుస్సహుడూ మొదలుగా గల కొడుకులూ, దుశ్శల అనే ఒక కూతురూ పుట్టారు.

గాంధారి గర్భవతిగా ఉన్న కాలంలో ఆమెకు బదులుగా తనకు పరిచర్యలు చెయ్యటానికి ధృతరాష్ట్రుడు ఒక వైశ్య స్త్రీని చేరదీశాడు. దుర్యోధనాదులు పుట్టిన యేడే ఆ స్త్రీ ధృతరాష్ట్రుడికి యయుత్సుడనే వాణ్ణి కన్నది.

ధృతరాష్ట్రుడు తన కొడుకుల కందరికీ రాజోచిత విద్యలు నేర్పించి, వారికందరికీ తగిన కన్యలను తెచ్చి వైభవంగా పెళ్ళిళ్ళు కూడా చేశాడు.





# యాచితం-అయాచితం

లక్ష్మన్న అనే ఆయన దానధర్మాలకు పెట్టింది పేరు. ఆయన భార్య మల్లమ్మ, అన్ని విధాలా భర్తకు అనుకూలవతి. క్రమంగా లక్ష్మన్న ఆస్తి కరిగిపోయి పేదవాడైపోయాడు. పూట గడిపడం కోసం మొదట ఆయన పెరటి దొడ్లో కూరగాయల పాదులు పెట్టాడు. అవి విరగ కాశాయి. కానీ అమ్మడం ఆయనవల్ల కాలేదు. దానధర్మాలకలవాటయినవాడు కదా – అందరిళ్ళకూ కూరగాయలు పంపాడు.

తర్వాత ఆయన వాళ్ళకీ వీళ్ళకీ చదువు చెప్పాలనుకున్నాడు. శాస్త్రాలు బాగా చదువుకున్నాడని చాలామంది, ఆయనవద్దకు వచ్చి చదువుకునేవారు. ఇంటికివచ్చినవారికి పండో, ఫలమో, పానకమో ఇవ్వకుండా పంపలేదు. ఆ ఖర్చు తప్ప, ఆయనకు చదువు చెప్పడం వల్ల ఒక్క పైసా ఆదాయం రాలేదు.

ఇలా పనికాదనుకుని ఆయన ఒకరోజున గొడ్డలి తీసుకుని అడవికి వెళ్ళాడు. రోజంతా కష్టపడి కట్టెలు కొట్టి మోపుకట్టి బయల్దేరబోతూండగా, ఒక పేదవాడు అక్కడికి వచ్చి, "అయ్యా! నేను కూటికి లేనివాణ్ణి. నా భార్య అర్ధాంతరంగా మరణించింది. బ్రతికున్నంత కాలం దాన్ని సుఖపెట్టలేదు. ఇప్పుడు దహనానికి కట్టెలు కొనలేకుండా వున్నాను. తమరు దయతలిస్తే, నా రోజులు బాగుపడ్డాక తమ ఋణం తీర్చుకుంటాను," అన్నాడు.

లక్ష్మన్న కట్టెలన్నీ వాడికిచ్చుకుని ఉత్త చేతులతో ఇల్లు చేరాడు. ఆయన జరిగినదంతా భార్యకు చెప్పి, "ఒకరిని దేహీ అని అడగలేము. వ్యాపారం చేయలేము. అడిగినవారికి కాదనలేము. మనకు జీవితం దుర్భరం. ఆత్మహత్య తప్ప గత్యంతరం లేదు," అన్నాడు.

మల్లమ్మ, భర్తను సముదాయించి, "నారు పోసినవాడే నీరు పోస్తాడు. మీరు బెంగపెట్టుకోకండి. చనిపోయేటప్పుడు మామయ్య చెప్పిన పని చేస్తే సరి!" అన్నది.

"వసుంధర"



లక్ష్మన్న తండ్రిచనిపోయేటప్పుడు ఆయనతో, "నీ దానగుణం నీకు సమస్యలు తెచ్చిపెడుతుంది. కానీ మంచిబుద్ధిని వదులుకోమనిచెప్పలేను కదా! ఏరోజు నీకు జీవితం దుర్భరమనిపిస్తుందో, ఆ రోజున శుచిగా స్నానం చేసి దైవపూజ ముగించి, రెండు చేతులతో నా పటాన్ని తాకు. ఆ వెంటనే ఇంటికొక బిచ్చగాడు వస్తాడు. వాడికి లేదనకుండా అడిగినదివ్వు. నీకు మేలు జరుగుతుంది," అని చెప్పాడు.

ఈ సంగతి భార్య గుర్తు చేయగానే లక్ష్మన్న అప్పటికి వూరుకుని, మర్నాడు తెల్లవారు ఝామునే లేచి తండ్రి చెప్పిన విధంగా చేశాడు. తండ్రి పటాన్ని రెండు చేతులతో తాకగానే, ఆయనకు, "గుప్పెడు గింజలు వేయి, తల్లీ!" అన్న బిచ్చగాడి కేక వినిపించింది.

మల్లమ్మ డబ్బాలో చూడగా, గుప్పెడంటే గుప్పెడే బియ్యంగింజలున్నాయి. ఆమె వాటిని తీసుకుని బిచ్చగాడికి వేయబోగా, "ఒక్క గింజ నీకుంచుకో, తల్లీ! అక్షయమౌతుంది," అన్నాడు వాడు.

ఒక గింజ మాత్రం తనకుంచుకుని, మిగతావన్నీబిచ్చగాడికి వేసింది మల్లమ్మ. తర్వాత ఆ గింజను డబ్బాలో వేసింది. ఆశ్చర్యంగా ఆ డబ్బా బియ్యంతో నిండిపోయింది.

ఆరోజు నుంచీ ఆఇంట్లో బియ్యం, పప్పులు, కూరగాయలు ఇలా ఒకటేమిటి — చివరకు డబ్బులు కూడా అక్షయమౌతూ వచ్చాయి. లక్ష్మన్న, మల్లమ్మ తమ దానగుణాన్ని కొనసాగిస్తూ సుఖంగా జీవించసాగారు.

తమ సౌఖ్యానికి కారణమైన ఆ బిచ్చగాడిని కలుసుకోవాలని మల్లమ్మకు చాలా కుతూహలంగా వుండేది. వాడెవరు? ఎలా వచ్చాడు? వాడు వస్తాడని చనిపోక మునుపే మామగారికి ఎలా తెలుసు?

కొన్నాళ్ళయ్యాక, బంధువింట్లో పెండ్లికి గాను లక్ష్మన్న దంపతులు దూర ప్రాంతాల వున్న పట్నానికి వెళ్ళారు. పట్నంలో పెండ్లి భోజనాలయ్యాక పేదలకు అన్నదానం జరిగింది. అక్కడ మల్లమ్మ, బిచ్చగాడిని చూసి గుర్తుపట్టింది. వాడినామె ఏకాంతంగా కలుసుకోవాలనుకున్నది. వద్దన పసులు చూస్తున్న

దూరపుబంధువుతో ఆమె, "అన్నయ్యగారూ! భోజనాలయ్యాక, ఆ బిచ్చగాడినొకసారి నావద్ద కుపంపండి," అన్నది.

ఆయన ఆశ్చర్యపడి, "వాడితో నీకేం పనమ్మా? కడుపు నిండా భోజనం పెట్టినా సరే, ఏ లోభి ఇంటికో వెళ్ళి బిచ్చమడుగుతాడు. రోజూ లేదన్నా వాడికి సిగ్గుండదు," అన్నాడు.

భోజనాలయ్యాక, భోజనం పెట్టినాయన చెప్పినా బిచ్చగాడు, మల్లమ్మను కలుసుకోలేదు. వాడు హడావుడిగా తనకేదో పనివుందని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. మల్లమ్మ కుతూహలంగా వాడేమి చేస్తాడో చూడాలని, వాడిని అనుసరించింది. లక్ష్మన్న కూడా ఆమెకు తోడుగా బయల్దేరాడు.

బిచ్చగాడు అక్కణ్ణించి ఒక లోభి ఇంటికి వెళ్ళాడు. ఆయన వాడితో తన ఇంట్లో ఏమీ లేదని చెప్పి తిట్టి పొమ్మన్నాడు. అక్కణ్ణించి వాడలా రెండు, మూడిళ్ళకు వెళ్ళాడు. అన్ని చోట్లా వాడికలాంటి మర్యాదే జరిగింది.

అప్పుడు లక్ష్మన్న దంపతులు వాడిని సమీపించారు. మల్లమ్మ వాడితో, "అయ్యా! మీరు సామాన్యులు కారు. మీ మహిమ వల్ల మేమిప్పుడు మా కష్టాలన్నీ తీరి సుఖంగా జీవిస్తున్నాం. కానీ తమరిలా ఇంటింటికీ తిరిగి బిచ్చమెత్తుకోవడం దేనికి? హాయిగా మా ఇంట్లోనే వుండవచ్చు గదా!" అన్నది. బిచ్చగాడు ఆమెవంక అదోలా చూసి, "అమ్మా!



మీ ఇంట్లో కూర్చుంటే నాకెలా గడుస్తుంది? నాలుగిళ్ళు తిరిగి లేదనిపించుకోవాలి. ఎవడైతే తన ఇంట్లో అన్నీ వుంచుకుని తనకేమీ లేదంటాడో, అవన్నీ వాడికి పోయినట్టే! అలాంటివే మీ ఇంట చేరి అన్నింటినీ అక్షయం చేస్తున్నాయి," అన్నాడు.

లక్ష్మన్న ఈ మాటలకు తెల్లబోయి, "మాకోసం నువ్వు ఇంటింటికీ తిరుగుతున్నావా? ఎందుకు?" అని అడిగాడు.

"ఈ ఆకారంలో నువ్వు నన్ను గుర్తుపట్టకపోతే ఆశ్చర్యమేముంది? నేను నీ తండ్రిని," అన్నాడా బిచ్చగాడు. దానితో లక్ష్మన్న, మల్లమ్మ ఆయన్ను గుర్తుపట్టి వెంటనే కాళ్ళ మీద పడిపోయారు. ఆయన వాళ్ళిద్దర్నీ లేవదీసి,

"నేనుండగా మీకే ఇబ్బందీ వుండదు. ఇంటికి వెళ్ళి సుఖంగా వుండండి," అని చెప్పాడు.

కానీ ఆ దంపతులిద్దరూ ఆయన తమ ఇంటికి వచ్చి వుండాలని పట్టు పట్టారు.

"వెర్రివాళ్ళలా వున్నారు మీరు. నేను చనిపోయి చాలా ఏళ్ళయిందని మరిచిపోతున్నారా?" అన్నాడు బిచ్చగాడు.

"అయితే ఏం — ఇప్పుడు మానవరూపం ధరించారుగా!" అన్నది మల్లమ్మ.

బిచ్చగాడు, ఆమెకేసి జాలిగా చూసి, "చని పోయిన వాళ్ళకు ఏ కోర్కెలూ, దిగులూ లేక పోతే వాళ్ళు దైవసాన్నిధ్యాన్ని చేరుకుంటారు. నేను మాత్రం మీ ఇంట్లో పటాన్ని ఆశ్రయించుకుని వున్నాను. మీ గురించి ఇంకా నాకు దిగులుగానే వుంది. మీకు డబ్బెలా సంపాదించాలో తెలియదు. దానధర్మాలు చేసే మంచి గుణముంది. నేను సంపాదించి పెట్టిన ఆస్తి అయిపోయింది. మీకై మీరు సంపాదించడం నేర్చుకుని, అందులోంచి కొంత దాన ధర్మాలకు వినియోగించడం అలవాటు చేసుకునే దాకా, నేనిలా బిచ్చగాడిలా తిరక్క తప్పదు. అందుకోసం మానవరూపం ధరించాను తప్ప, మీ ఇంట్లో వుండడానికి వీలుపడదు. అది ప్రకృతి విరుద్ధం!" అని మాయమయ్యాడు.

తండ్రి చెప్పినది విని లక్ష్మన్న కళ్ళనీళ్ళు పెట్టుకుని భార్యతో, "దాన ధర్మాలతో పేద వారిని ఆదుకుంటున్నానని భ్రమపడ్డాను. దాని కోసం నా తండ్రి నింతగా కష్టపెడుతున్నానని ఇప్పుడే గ్రహించాను. ఇక మీదట అయాచితంగా వచ్చేదంతా, నా తండ్రి యాచితమేనని తెలుసుకుని — నేను స్వయంగా ధన సంపాదనకు పూనుకుంటాను. అప్పుడే నా తండ్రికి విమోచనం కలుగుతుంది," అన్నాడు.

క్రమంగా లక్ష్మన్న సంపాదనాపరుడయ్యాడు. ఆయన అవసరంలో వున్న వారెవరికీ వుండి కూడా లేదనలేదు. అలా అంటే తన డబ్బు మాయమై, మరొకరి ఇంట చేరుతుందన్న భయం ఆయనకు లేదు. సొంత సంపాదన అంటూ లేకుండా, అయాచితంగా లభించిన ధనాన్ని దానధర్మాలు చేస్తూ కొందరు మూర్ఖులు, తమ పూర్వీకుల నిబ్బంది పెడుతున్నారని మాత్రం ఆయనకు బాధగా వుండేది.



# చందమామ కబుర్లు

## మొసళ్లూ ఉపాధ్యాయులే!

ప్రకృతిని అధ్యయనం చేయాలంటే మనం మామూలుగా కొండలనూ, కోనలనూ, మేఘాలనూ, నదులనూ. సముద్రాలనూ పరిశీలనగా చూస్తాం. పూలను వాసన చూస్తాం. జంతువులనూ, పక్షులనూ జాగ్రత్తగా పరిశీలిస్తాం. ప్రకృతిని గురించి మనకు ఏర్పడే అనుమానాలు తీర్చే ఇవి, ఒకవిధంగా మనకు ఉపాధ్యాయుల



వంటివని చెప్పవచ్చు. థాయ్‌లాండ్‌లోని పామిట్టి అనే ఊళ్లో ఒక పాఠశాల సమీపంలోని గుంటలో మొసళ్ళను పెంచుతున్నారు. ఆ పాఠశాలలో వెయ్యిమందికి పైగా విద్యార్థులు చదువుతున్నారు. మొసళ్ళ వల్ల విద్యార్థులకు ఆపద రాగలదన్న భయంతో, వాటిని అక్కడి నుంచి తొలగించమని చెప్పారు వాళ్ళ తల్లిదండ్రులు. కాని స్కూలు డైరెక్టర్ మాత్రం, "వాటివల్ల విద్యార్థులకు ఎటువంటి ఆపదా రాదు. పైగా అవి విద్యార్థులకు ప్రకృతి రహస్యాలు తెలుసుకోవడానికి సహాయపడే ఉపాధ్యాయుల వంటివి!" అన్నాడట.

## పెంపుడు జంతువుల ప్రేమ!

కుక్కలనూ, పిల్లులనూ, చిలుకలనూ ఇళ్ళ దగ్గర పెంచడం కొందరికి ఇష్టం. నెదర్లాండ్స్ రాజధాని హేగ్ నగరంలో నివసిస్తున్న ఒక ఇల్లాలు కుక్కలనూ, చిలుకలనూ, మైనాలనే కాదు; తేళ్ళనూ, పాములనూ, ఉడుములనూ విడివిడిగా బోనుల్లో పెట్టి, ఇంట్లోనే పెంచుతున్నది. వీటి వల్ల ఆమెకు ఎంతో ఆనందమే గాని, ఈ కారణంగానే, ఆమె భర్తా, ఇద్దరు పిల్లలూ ఆమెను విడిచి వెళ్ళడానికి సిద్ధపడ్డారు. ఈ జంతుజాలాన్ని వదులుకుంటేనే తాము తిరిగి రాగలమని వాళ్ళు అంటున్నారు!

## యజమాని కోసం!

దక్షిణ కేరళలోని మైలంమూడ్ అనేచోట శిక్షణ పొందిన ఒక ఏనుగు చేత ఇరవై రోజుల పాటు పెద్ద పెద్ద దుంగలను మోయించారు. రాత్రి పూట మావటివాడు ఆ ఏనుగును ఒక చెట్టుకు గొలుసుతో బంధించి వెళ్ళే వాడు. చెట్టు పక్కగా ఒక నది ప్రవహిస్తున్నది. గత ఆగస్టు 1వ తేదీ మావటివాడు ఎప్పటిలా ఏనుగును చెట్టుకు కట్టి వెళ్ళాడు. ఆ రాత్రి నది పొంగి చెట్టు చుట్టూ జలమయమయింది. అయినా, ఏనుగు ఘీంకరించలేదు. తెల్లవారేసరికి తొండం తప్ప, ఏనుగు పూర్తిగా నీళ్ళలో మునిగిపోయింది. దానిని చూసిన వేరొక మావటివాడు



గొలుసును విప్పి, ఏనుగును వెలుపలికి తీసుకురావడానికి ప్రయత్నించాడు. కాని అది ఒక అడుగు కూడా కదలలేదు. ఆఖరికి తన యజమాని అయిన మావటివాడు వచ్చి, తొండాన్ని నిమిరాక ఏనుగు ఈదుకుంటూ గట్టుకు చేరింది!




# స్త్రీ పరాక్రమం

పూర్వం ధర్మపురాన్ని దుర్జయుడనే రాజు పాలించేవాడు. ఆయన ఏడాది కొకసారి తన సామంతుల నందరినీ ధర్మపురానికి పిలిపించి మూడు రోజులపాటు ఉత్సవాలు జరిపి, విందులూ, వినోదాలూ ఏర్పాటు చేసేవాడు.

ఒకయేడు ఇలాగే ఉత్సవం ఆరంభమయింది. దుర్జయుడూ, ఆయన సామంతులూ విందులో కూచున్నారు. అందరూ ఆనందంలో మునిగి తేలుతున్నారు. ఒక్కొక్కరే తమ తమ గొప్పలు చెప్పుకుంటున్నారు. కొందరు తమ కోటలో గల రహస్యద్వారాలను గురించీ, మరికొందరు తమవద్ద ఉన్న అరబ్బీ గుర్రాలను గురించీ, ఇంకా కొందరు తమ దేశంలో వుండే అందమైన పళ్లను గురించీ — ఈవిధంగా తలా ఒక తీరునా ప్రగల్భాలు పలుకుతూ వినోదిస్తున్నారు.

కాని విజయుడనే ఒక యువకుడు మాత్రం నోరు మెదపక రాయిలాగా కూచున్నాడు. దుర్జయుడు ఇది గమనించి, "ఏం, విజయా? అందరూ తమ తమ గొప్పలు చెప్పుకుంటూంటే నీకేమీ లేదా?" అని అడిగాడు.

"నేను గొప్పచెప్పుకోదలిస్తే నా భార్య మాలినిని గురించి చెప్పుకోవాలి. అది ఇక్కడ అప్రస్తుతమని ఊరుకున్నాను, మహారాజా!" అన్నాడు విజయుడు.

"నీ భార్యలో ఉన్న గొప్పదనమేమిటో చెప్పు, విని మేము కూడా సంతోషిస్తాము! ఆమె గొప్ప అందగత్తె అవునా? లేక సంగీతంలో ప్రతిభావంతురాలా? లేక పుష్పాలంకరణలో నైపుణ్యం గలదా? నీ భార్య ఎందులో గొప్పది?" అని దుర్జయుడు అడిగాడు.

"మహారాజా, నా భార్యకు మీరు చెప్పిన గొప్పలన్నీ ఉన్నాయి. కాని అన్నిటినీ మించి ఆమె అసాధారణ పరాక్రమవంతురాలు! కత్తియుద్ధంలోగాని, విలువిద్యలోగాని, గదా

యుద్ధంలోగాని ఆమెను ఎదుర్కోగల వారెవరూ లేరు!" అన్నాడు విజయుడు.

"ఇంతమంది యోధుల మధ్య అంటున్నావు, కాస్త యోచించి మరీ మాట్లాడు!" అన్నాడు దుర్జయుడు రోషంతో.

"మహారాజా, ఇక్కడి సామంతుల మాట ఎందుకు? తమరు కూడా నా భార్య ముందు ఎంతోసేపు నిలబడలేరు. ఇది అతిశయోక్తి కాదు!" అన్నాడు విజయుడు.

దుర్జయుడికి రోషం బాగా వచ్చింది. ఆయన తన భటులను పిలిచి, "ఈ దుర్మార్గుణ్ణి వెంటనే పట్టుకుపోయి పాతాళగృహంలో బంధించి జొన్నరొట్టెలు తినిపించండి!" అని ఆజ్ఞాపించాడు.



విజయుడు చేసేదిలేక రాజాజ్ఞ ప్రకారం అంధకారకూపంలోకి ప్రవేశించి, తనకు తిరిగి ఏవిధంగా విముక్తి కలుగుతుందా అని విచారించసాగాడు.

ఈలోపల విజయుడి భార్య మాలిని తన భర్త కోసం ఎదురుచూస్తూ ఉన్నది. ఉత్సవాలు ముగిసినా అతడు రాకపోవటం చూసి ఆమె తన నౌకర్లను పంపింది. వారు తిరిగి వచ్చి, మహారాజుగారు విజయుణ్ణి ఖైదు చేయించినట్టు తెలిపారు.

వెంటనే మాలిని తన గుర్రాన్ని ఆయత్తం చేయించింది; తాను కవచమూ, శిరస్త్రాణమూ ధరించింది; తన కత్తీ, ఇనుప గదా, విల్లూ, అంబుల పొదీ తీసుకున్నది? ఒక వందమంది సైనికులను గుర్రాల మీద తనవెంట పెట్టుకుని ధర్మపురానికి వెళ్లింది. నగరం వెలుపల మైదానంలో డేరాలు వేసి శిబిరం ఏర్పాటుచేశారు. తరవాత మాలిని ఒంటరిగా తన గుర్రంమీద బయలుదేరి దుర్జయ మహారాజు వద్దకు వెళ్లింది.

పురుష వేషంలో, వీరోచితమైన దుస్తులు ధరించి వచ్చే మాలినిని చూడగానే దుర్జయుడు నిర్ఘాంతపోయాడు. ఆమె ఆయనకెదురుగా ఠీవిగా నిలబడి, "మహారాజా, నేను కళింగ చక్రవర్తి దూతను! మీవద్ద పది లక్షల వరహాలు కప్పం వసూలు చేసుకు రమ్మని మా చక్రవర్తి నన్ను పంపారు. మీరు కప్పం ఇవ్వ నిరాకరించే పక్షాన యుద్ధానికి



సిద్ధమయ్యే వచ్చాను. నలభై వేల బలం గల మా సేన మీ నగరం వెలుపల విడిసి వున్నది. కప్పం కడతారో, యుద్ధమే చేస్తారో వెంటనే తెలియజేయండి!" అన్నది.

ఈ మాట వినగానే దుర్జయుడికి కాళ్ళు చల్లబడ్డాయి. కళింగ చక్రవర్తితో విరోధం పెట్టుకోవటం తనకూ, తన రాజ్యానికీ క్షేమం కాదు. కప్పం కడదామంటే తనవద్ద పది లక్షల సొమ్ము సిద్ధంగా లేదు. యుద్ధం చేద్దామంటే, నలభై వేల మంది గల సేనను ఎదిరించటానికి తాను సైన్యాన్ని సమీకరించాలి. ఇందుకుగాను తమ సామంతులందరికీ కబురు పంపితే తప్ప, అది సాధ్యం కాదు.

"వెంటనే సమాధానం చెప్పలేను. నాకు మూడు రోజుల వ్యవధి కావాలి!" అన్నాడు దుర్జయుడు.

"ఒకందుకు మీరు సమ్మతిస్తే మీరు కోరినట్లు మూడు రోజులు వ్యవధి ఇస్తాను. మీ కుమార్తెను నాకిచ్చి పెళ్లి చెయ్యండి!" అన్నది మాలిని.

దుర్జయుడు ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. "దానికైనా ఒకరోజు వ్యవధి ఇస్తేనేగాని చెప్పలేను. నా కుమార్తె మనసు కూడా తెలుసుకోవాలి," అన్నాడాయన.

"సరే, అలాగే కానివ్వండి. రేపు లోపుగా మీ కుమార్తెను నాకిచ్చి పెళ్లిచేసే ఏర్పాటు చేయండి. మరి రెండు రోజుల లోపల కప్పం చెల్లించండి. ఇందులో ఏది జరగక పోయినా యుద్ధం తప్పదు!" అన్నది మాలిని.

దుర్జయుడు తన కుమార్తెతో రాయబారి కోరిక గురించి చెప్పాడు. రాజకుమార్తె చీదరించుకుంటూ, "ఛీ, ఆ అడంగిరేకుల వాణ్ణి నేను చేసుకోను! అసలా మనిషి నడకా, మాటా చూస్తే నాకు ఆడదనే తోస్తోంది! నువ్వెందుకు బెదిరిపోతున్నావో నాకర్థం కావటం లేదు!" అన్నది.

కూతురీ మాట అనటంతో దుర్జయుడికి కొంత ధైర్యం వచ్చింది. ఆయన ఆ సాయంకాలం కళింగ దూతను తన భవనానికి పిలిపించి కొంచెంసేపు జూదం ఆడాడు. ఆడిన ప్రతి ఆటలోనూ దుర్జయుడు చిత్తుగా ఓడి

పోవటం జరిగింది. తరవాత ఇద్దరూ గుర్రా లెక్కి ఉద్యానవనానికి వెళ్లారు.

"అస్త్రవిద్యలో మీతో పోటీ చెయ్యాలని ఉన్నది! నేను చెప్పినట్లు చేయించండి!" అన్నది మాలిని. ఆమె ఒక చోట కత్తి ఒకటి బలంగా పాతించింది. దానికెదురుగా ఒక బంగారు వలయం వేలగట్టించింది. "మనం ఇక్కడినుంచి బాణాలు వదులుదాం. బాణం వలయంలో నుంచి వెళ్లి కత్తికి తగిలి రెండు భాగాలు కావాలి!" అన్నదామె.

దుర్జయుడు ఒకదాని వెనక ఒకటిగా మూడు బాణాలు వేశాడు. ఒకటి కూడా వలయంలో నుంచి వెళ్లలేదు. "నేను వేస్తాను చూడండి!" అంటూ మాలిని తన విలుతాడు రెండు మూడు సార్లు మోగించి, అంబుల పొది నుంచి బాణం ఒకటి తీసి, ఎక్కుపెట్టి చెవిదాకా లాగి వదిలింది. ఆ బాణం వలయంలో నుంచి వెళ్లి కత్తికి తగిలి రెండు చీలికలై పడిపోయింది. రెండు చీలికలనూ త్రాసులో రెండువైపులా వేసి తూస్తే సమంగా తూగాయి.

ఇది కళ్లారా చూసిన దుర్జయుడికి మతి పోయినట్టయింది. ఆయన ఆ రాత్రి తన కుమార్తెతో, "నువ్వు ఈ రాయబారిని పెళ్లాడక తప్పదు! ఆయన అడంగి రేకులవాడా? ఎంతో గొప్ప యోధుడు! ఆయన చదరంగం ఆటను బట్టి చూసినా, యుద్ధంలో ఆరితేరిన వాడని తెలిసిపోతోంది! నువ్వు నా మాటకు ఎదురు చెప్పకు!" అంటూ తన కుమార్తెను పెళ్లికూతుర్ని చేయటానికి ఉత్తరువిచ్చాడు.



# ప్రకృతి వింతలు :




## నేరస్థులను పట్టే కుక్కలు

నేరస్థులను పట్టుకోవడానికి పోలీసులు కుక్కలను పట్టుకొచ్చారని మనం తరచూ చదువుతూ వుంటాము. బ్లడ్‌హౌండ్ అనే జాతికి చెందిన ఈ కుక్కలు చాలా తెలివైనవి. అంతేకాదు. వీటి ఘ్రాణ శక్తి కూడా చాలా సునిశితమైనది. నేరం జరిగిన స్థలంలో దోషులు నడమాడినప్పుడు ఏర్పడిన వాసననుబట్టే వాళ్ళను పట్టేయగలవు. బ్లడ్‌హౌండ్స్‌లో ఫాక్స్ హౌండ్, కూన్ హౌండ్, బెసెంజీ, బీగిల్, బేసెట్ హౌండ్ మొదలైన రకాలు ఉన్నాయి. 'డాష్ హౌండ్' అనే జాతి కుక్కలకు పోలీసు శిక్షణ నివ్వడం చాలా సులభం.



## తిమింగిలాల వేట

ఇటీవల 'గ్రీన్‌పీస్' అనే ఓడలోని సిబ్బంది, తిమింగిలాలను వేటాడే ఓడనుంచి ఒక తిమింగిలాన్ని విడిపించినట్టు వార్త వెలువడింది. తిమింగిలాలను ఎందుకు వేటాడతారు? తిమింగిలాల వెలుపలి చర్మానికీ, లోపలి కండరాలకూ మధ్య దళసరి 'కొవ్వుపొర' వుంటుంది. ఇది తిమింగిలాలను,ముఖ్యంగా ఆర్కిటిక్‌సముద్రాలవంటి చల్లటి నీళ్ళలో నివసించే వాటికి దుప్పటి వంటిది. ఈ కొవ్వును కరిగించి, రంగులకూ వార్నీష్‌లకూ ఉపయోగించే నూనెను తయారుచేస్తారు. జపాన్ వంటి దేశాలలో తిమింగిల మాంసం తింటారు.




## తామరాకుల మీద నడిచే పక్షి!

నీళ్ళ మీద నడిచే పక్షులను మీరెప్పుడయినా చూశారా? మనుషులను చూడగానే పారిపోయే ఆ 'జాకానా' పక్షులను సమీపించి పరిశీలించిచూసినట్టయితే అవి నీళ్ళ మీద కాకుండా పెద్ద పెద్ద తామరాకుల మీద నడవడం గమనించవచ్చు. వాటి పొడవాటి కాలి వేళ్ళూ, గోళ్ళూ, శరీరం బరువు నీటిపై తేలే ఆకు మీద సమతలంగా మోపడానికి ఉపయోగపడతాయి. అందువల్ల ఆకు మునిగిపోదు. అంతేకాదు. ఈ పక్షులు నాచుముక్కలతో తామరాకుల మీదే గూళ్ళు కడతాయి!

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


S.B. PRASAD


K. MADHU

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **తలపండని ముని!** రెండవ ఫోటో : **తలకుమించిన పని!**

పంపినవారు : వరగాని సీత, W/o డా॥ వి. విజయసాగర్

కారంపూడి పోస్టు (మండలం), గుంటూరు జిల్లా - 522 614 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

**సంవత్సర చందా :**

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 105.00 ఎయిర్‌మెయిల్ ద్వారా : రూ. **252.00**

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా : **252.00**

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# దీనికంటే గొప్ప రుచి గలది ఏది !




పార్లే

# బిగ్ చీఫ్

## పండ్ల రుచితో కూడిన టాఫీ

అరటిపండు ♦ మేంగో ♦ ఆరెంజ్

everest/94/PP/72-tl